# పౌర ధర్మ శాస్త్రము

కర్త:

డా॥ ఆర్. వి. రావు, M. A. Ph. D.
( Joint Director Commerce and Industries )

ప్రచురణ:

ఆంధ్ర సారస్వత పరిషత్తు,
తిలక్ రోడ్డు, హైదరాబాదు.

వెల: 1—4—0

# తొలిపలుకు

విద్వద్వర్యులును నా చిర మిత్రులును నగు శ్రీ ఆర్. వి. రావు గారిచే రచింపబడిన "పౌరధర్మశాస్త్రము" నకు తొలిపలుకు వ్రాసియు నవకాశమును పొందుట నాకు చాల సంతోష ప్రదమగు కార్యము.

పౌరధర్మములను గురించిన యొక గ్రంథమును "ఆంధ్ర చంద్రికా గ్రంథమాల" కొరకు వ్రాసి యిచ్చుటకు నేను కొంతకాలము క్రింద శ్రీ రావు గారిని ప్రార్థించి యుంటిని. వారు నా కోరికను మన్నించి యా గ్రంథమును వ్రాసి నాకుపంపి యుండిరి. కాని దానిలో కొన్ని మార్పు లవసరముగా భావింపబడినందున అది వెంటనే ముద్రితము కాజాలక పోయెను. ఇప్పుడు ఆ గ్రంథము ప్రఖ్యాత సంస్థయగు ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు వలన ప్రకాశిత మగుచుండుట ప్రశంసింప దగి యున్నది.

నేటి కాలమున, పౌరధర్మములను గురించిన జ్ఞానము మన దేశ మున- ముఖ్యముగా తెలగాణమున—జనసామాన్యమున మూల మూలల వ్యాపించుట ఎంత యవసరమో వివరింపవలసిన పనిలేదు. రాజకీయ పరిజ్ఞానమునకు పౌరధర్మ శాస్త్రముతో నెట్టి సన్నిహిత సంబంధముకలదో సర్వజన విదితము. ఇట్టి యుత్తమ విషయమున సామాన్యులగు వారికి సుబోధకమగు చక్కని పుస్తకమును, బహు కార్యనిమగ్నులగు గ్రంథకర్త మహాశయులు శ్రమచేసి వ్రాసి యిచ్చుటయు, ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు దానిని ప్రకటింప బూనుటయు జరుగుచున్నది. కనుక వీరు మన దేశమునకును, భాషకును గొప్ప సేవ జేయుచున్నారనుట నిర్వి వాదాంశము.

పౌర ధర్మశాస్త్రము, హైస్కూలు విద్యా విధానమునందు నిర్బంధముగను, విశ్వ విద్యాలయ శిక్షణముయొక్క ప్రవేశ పరీక్ష

(Pre-University examination) కు ఐచ్ఛికముగను పఠనీయముగా విధించబడి యున్నందున ఈ గ్రంథము ఆంధ్ర విద్యార్థులకు గూడ చాల ఉపయోగ పడుననుట నిస్సంశయము.

కనుక ఈ పుస్తకము వలని లాభము విద్యార్థులును, తదితరులును-అందరును-పొందెదరని ఆశించుచున్నాను.

"ఆంధ్ర కుటీరము"
హైదరాబాదు.
౨౪-౮-౧౯౫౬.

మాడపాటి హనుమంతరావు.

# ఉపోద్ఘాతము.

అమెరికా అధ్యక్షుడు అబ్రహాంలింకన్ నిర్వచించిన "ప్రజలచేత, ప్రజలకొరకు ఏర్పాటుచేయబడిన ప్రజాప్రభుత్వములు" నేడు ప్రపంచమునందు దాదాపు అన్ని దేశములందును సాగుచున్నవి. అట్టి ప్రభుత్వము మన భారతదేశమునందును నెలకొల్పబడి నడచుచున్నది.

ప్రజలకొరకు, ప్రజలచేత నిర్మించబడిన ప్రభుత్వమును నెలకొల్పవలయునను ఆశయము పవిత్రమైనదే. కాని దీని నాచరణలోనికి తెచ్చుటలో పెక్కు కష్టములు గలవు. ప్రజలు తమతమ హక్కులను గుర్తెరుగనిచో పశుప్రాయులగుదురు. తమ బాధ్యతలను తెలిసికొననిచో సంఘ విచ్ఛిత్తిని కొని తెచ్చుకొందురు. ప్రజల "హక్కులు, బాధ్యతలు" అను రెంటిని గూర్చి నచ్చచెప్పుటకై చిరకాలమునుండి మహనీయు లనేకులు ప్రయత్నించుచున్నారు.

నేటి పిన్నలు రేపటి పౌరులు. వారు తమ కర్తవ్యములను సమగ్రముగా నిర్వర్తించునట్లు చేయుటయే విద్యాలయముల ప్రధానాశయము. అందువలన పౌరధర్మ శాస్త్రము తప్పక చదువవలసిన విషయము. ఇంతటి ప్రాముఖ్యముగల యీ శాస్త్రమును, విద్యార్థులు కేవలము పరీక్షలయందు తీర్ణులగుటకు మాత్రమే కాక, జీవితమునందు తీర్ణులగు నుద్దేశముతో కూడ పఠింపవలయును. అట్టి కుతూహలమును రేకెత్తించుటయే యీ పుస్తకముయొక్క ముఖ్య ఆశయము.

ఈ ప్రజాస్వామ్య యుగమున ప్రజలలో విజ్ఞానతృష్ణ అధికమగుచున్నది. సులభశైలిలో, విషయము సుబోధకమగు నట్లు ప్రజాధర్మములను నిర్వచించు గ్రంథములు నేడు అత్యావశ్యకములు. ఎక్కువవెల గల పెద్ద గ్రంథములు లాతృష్ణను తీర్పజాలవు. కావున ప్రజానీకమునకు వైజ్ఞానికముగను, ఆర్థికముగను అందుబాటులో నుండుటకై యీ గ్రంథమును రచించుట జరిగినది.

భారత ప్రజలలో పౌరధర్మములయెడ శ్రద్ధ, వానిని నిర్వర్తింపవలె ననియెడి పట్టుదల యేర్పడినయెడల అది భారతదేశము నిత్యకళ్యాణము, పచ్చతోరణముగ నుండునట్లు చేయుటయే కాక, ప్రపంచసౌభాగ్యమునకే నాంది ప్రస్తావన కాగలదు.

ఈ గ్రంథము వ్రాయుమని బ్రహ్మశ్రీ ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారు కొన్ని సంవత్సరములక్రిందట నన్ను కోరిరి. కారణాంతరముల వలన వెంటనే అట్లుచేయుట వీలుపడకుండెను. వారి ప్రోత్సాహమునకు నా ధన్యవాదములు. మరియు నా మిత్రులు శ్రీ డాక్టర్ మారేమండ రామారావుగారు కూడ తొందరలో యీ గ్రంథము వ్రాయుటకు ఎంతో తోడ్పడిరి. వారికి కూడ నా వందనములు.

రాంపల్లి విశ్వేశ్వరరావు.

# విషయ సూచిక

# సవరణలు

| పుట | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 71 | 16 | ప్రజలకు | ప్రభుత్వమునకు |
| 102 | 10 | మొనటి | మొదటి |
| ,, | 20 | దశాద్దము | దశాబ్దము |
| 104 | 18 | "అందు వ్యక్తియొక్క హక్కులు నిర్వచింప బడినవి" అను వాక్యము పొరబాటున ఆ స్థలమున పడినది. దీనిని కొట్టివేయవలెను. | |
| 105 | 10 | Rupublic | Republic |

అటనట విరామ అర్ధ విరామ చిహ్నములు అస్త వ్యస్తముగ పడినవి. సందర్భాను సారముగ వానిని సవరించుకొన గోరుచున్నాము.

# మొదటి ప్రకరణము

## పౌరధర్మశాస్త్రము—ఆవశ్యకత

ఆర్థిక సాంఘిక రాజకీయ రంగములలో అతి త్వరిత గతిని మార్పులు వచ్చుచున్న యీ రోజులలో, పౌరసత్వ ధర్మమననేమి? పౌరసత్వాశయము లెట్టివి? అను సంశయములను ప్రతి పౌరుడును గ్రహింపవలసియున్నది. అందును ప్రజాస్వామిక రాజ్యాంగమునందు పౌరుని బాధ్యతలు మరియు ముఖ్యమైనవి. వాస్తవముగ ప్రపంచ పురోభివృద్ధి సరియైన పౌరసత్వాశయములను నిర్ణయించుకొనుటపైనను, వాటిని అమలు జరుపుటపైనను ఆధారపడి యున్నది. పౌరధర్మశాస్త్ర మీ సందర్భమునం దెక్కువగ నుపకరింప గలదు.

నిర్వచనము:- సివిక్సు అను ఆంగ్లేయపదము (ఇది పౌరధర్మ శాస్త్రమునకు ఆంగ్లము) "సివిస్" అను ల్యాటిను భాషాపదమునుండి యేర్పడినది. 'సివిస్' అనగా 'పౌరుడు' అని అర్థము. పౌరుని ధర్మములను నిర్ణయించు శాస్త్రమే "సివిక్సు" లేక "పౌరధర్మశాస్త్రము".

పూర్వము గ్రీసు దేశమున నగర రాష్ట్రములు (సిటీ స్టేట్సు) వర్ధిల్లినవి. ప్రతి పట్టణరాష్ట్రమును నిర్ణీతమైన కొంత ప్రదేశమును కలిగి, తక్కిన పట్టణములతో రాజకీయాది సంబంధములను సాగించుకొను చుండెడిది. అట్టి రాష్ట్రము నందు నివసించువారిని సిటిజన్సు లేక పౌరులు అని పిలుచు చుండిరి. కాని యీనాడు సాంఘిక రాజకీయములగు హక్కుల

ననుభవించు ప్రతివ్యక్తిని మనము పౌరుడు అని పిలుచు చున్నాము.

"పౌరుని సాంఘిక, వైజ్ఞానిక, ఆర్థిక, రాజకీయ, మత విషయము లన్నిటిని ప్రాంతీయముగను, జాతీయముగనే గాక, మానవకోటి కంతటికిని సంబంధించినవిగ చర్చించి, వాటి గత చరిత్రను, వర్తమాన స్థితిని తెల్పుటయే గాక భవిష్యత్తును గూడ శాసించు సాంఘిక శాస్త్రముయొక్క ముఖ్యమైన భాగమే పౌరధర్మ శాస్త్రము." అని ఇ. ఎమ్. వైటు అను రచయిత సివిక్సును నిర్వచించెను. "దండనీతి పైననే లోకయాత్ర ఆధారపడి యున్నది." అని ఆచార్య చాణక్యుడు తన అర్థశాస్త్రమున తెలిపియుండెను.

ఆవశ్యకత:-మానవుడు పరిపూర్ణుడు కాడు. అతనిలో మంచి చెడ్డలు కలిసియుండును. పరిసరములతో తన సంబంధము నెట్లేర్పరచు కొనవలెనో, జీవితరంగము లన్నిటియందును తన బాధ్యత యెట్టిదో, పౌరధర్మశాస్త్ర మాతనికిబోధించును.

మానవుడు తనయందలి మంచిని పూర్తిగ నుపయోగించుకొని, పరిసరములతో వైరుధ్యము నేర్పరచుకొనక సమగ్రముగా తన సామర్థ్యముల నుపయోగించుకొనుట ఎట్లో పౌరధర్మ శాస్త్రము తెలుపగలదు. రాజ్యాంగము నందతని హక్కులెట్టివో, బాధ్యతలెట్టివో పౌరునికి తెలియజేయగల శాస్త్రమే పౌరధర్మ శాస్త్రము. కుటుంబము, జాతి, పట్టణము, దేశము — వీటియెడ తన ధర్మమేదియో, విధి యెట్టిదో, పౌరునకు యీ శాస్త్రము బోధించును. సంకుచితమగు నాలో

చనలను విడనాడి, అంతర్జాతీయ దృక్పథము నలవరచుకొను టకు యీ శాస్త్రము తోడ్పడగలదు. కాన సత్పౌరపథమును, సరియైన నడవడిని బోధించు శాస్త్రమే పౌరశాస్త్రము లేక పౌరధర్మశాస్త్రమని మనము నిర్వచింప వచ్చును.

## తక్కిన సాంఘిక శాస్త్రములతో పౌరధర్మశాస్త్రము యొక్క సంబంధము

ప్రతి శాస్త్రమును కొన్ని సామాన్యసత్యములను బోధించును. ౧. విశేషములైన విషయములనుండి సామాన్య ధర్మములను గ్రహించి సామాన్య ధర్మములను కూర్చుట. ౨. కొన్ని సామాన్య సూత్రములకు అనేకములైన ఉదాహ రణముల నిచ్చుచు విశేష విషయముల నేర్పరచుట. అను రెండు పద్ధతుల నవలంబించి ప్రతిశాస్త్రమును తన శాస్త్ర భాగముల నభివృద్ధి చేయును. కొన్ని సాంఘిక సామాన్యసత్యాసత్య ముల బోధించుశాస్త్రము సాంఘికశాస్త్రము (సోషియాలజీ). పౌరధర్మ శాస్త్రము, సాంఘిక శాస్త్రము యొక్క ఒక అంగమగుటచే రాజకీయ శాస్త్రము, నీతిశాస్త్రము, అర్థ శాస్త్రము, చరిత్ర మున్నగు నితర సాంఘికశాస్త్ర శాఖ లతో సంబంధము కలిగియున్నది.

పౌరధర్మ శాస్త్రము — రాజకీయ శాస్త్రము:- రాజ్యాం గము, ప్రభుత్వము, పరిపాలన మున్నగు విషయములను గూర్చి తెలుపునది. రాజకీయ శాస్త్రము రాజకీయముగా వ్యక్తియొక్క నడవడికను శాసించును. పౌరుని హక్కులు,

బాధ్యతలు. ప్రజాస్వామికముగాగల రాజ్యాంగ విధానములు, సమాజము, సంఘ పరిణామము ప్రభుత్వము యొక్క ఉత్పత్తి మున్నగు అంశములను పౌరధర్మ శాస్త్రము, రాజకీయ శాస్త్రము కూడ చర్చించును. కాన పౌరధర్మ శాస్త్రము రాజకీయ శాస్త్రమున ఒక భాగము మాత్రమని చెప్పజాలము కాని, రెండింటికిని దగ్గర సంబంధము కలదనుట మాత్రము నిజము.

పౌరధర్మశాస్త్రము _ నీతి శాస్త్రము:- ఏది సత్ప్రవర్తన, ఏది కాదు; ఏది నీతి, ఏదిఅవినీతి అను విషయములను చర్చించు శాస్త్రము నీతి శాస్త్రము. మానవుని సత్ప్రవర్తన కంతటికిని బాధ్యత వహించు నీతిశాస్త్రముతో సంకుచితములైన అవధుల నన్నిటిని అతిక్రమించి అంతర్జాతీయతను కూడ అలవరచు కొనునటుల పౌరుని వర్తనమును నిర్ణయింపగల పౌరధర్మ శాస్త్రమునకు దగ్గరి చుట్టరికమని చెప్పక తప్పదు.

పౌరధర్మశాస్త్రము — ఆర్థికశాస్త్రము:— వస్తువుల ఉత్పత్తి, పంపకము, వినియోగము అను విషయములను బోధించునది అర్థశాస్త్రము. పౌరుడు రాజకీయ చైతన్యముగల వ్యక్తిగా నుండినంత మాత్రమున సమగ్రమైన వ్యక్తిగా నేరడు. అతడు ఆర్థిక రంగములలో కూడ (ఉదాహరణకు) పన్నుల విధానము మున్నగు విషయములకు సంబంధించినంతవరకు నైనను జ్ఞానము నలవరచుకొనవలెను. కాన సత్పౌరునికి అతని విధులను స్పష్టీకరించుటకు ఆర్థిక శాస్త్రము తోడ్పడగలదు.

పౌరధర్మశాస్త్రము-చరిత్ర:— పౌరధర్మ శాస్త్రము

తన సామాన్య సత్యములయొక్కయు, విశేషములయొక్కయు పరిణామమును చరిత్ర నుండియే గ్రహించును. పౌరసత్వా శయముల గతమును అవగాహన చేసికొనిన గాని వాటిభవిష్య త్తును నిశ్చయింపజాలము; విలువకట్టజాలము. రాజకీయ శాస్త్రము వంటి తక్కిన సాంఘిక శాస్త్రములకు వలెనే పౌరధర్మశాస్త్రమునకును చరిత్రయే మూలాధారము.

---

# రెండవ ప్రకరణము

## మానవ సమాజము—దాని పరిణామము

మానవుడు సంఘజీవి. సంఘమున జీవించుట అతని సహజ గుణములలో నొకటి. అనాది నుండియు సాంఘిక చైతన్యముతో జీవించుట కతడలవాటు పడియున్నాడు. మానవత్వమునందలి యీ సహజ గుణమునే అరిస్టాటిల్ అను గ్రీకు తాత్త్వికుడు స్పష్టీకరించెను. కొన్ని జంతువులు సహజముగ మందలు మందలుగ జీవించును. సంఘీభావము, పరస్పర సహకారము, జీవితమునందలి పోరాటమున కత్యవసరములగుటచే అట్లు గుంపులుగ బ్రతికిన జంతువులే ప్రకృతితో పోరాడి గెలువగల్గినవి. సహజముగ సంఘ జీవనము నలవరచుకొనని జంతువు లేనాడో నశించిపోయినవి. కీటకములలో చీమలును తేనెటీగలును జంతువులకంటే ఉన్నతమైన సంఘ నిర్మాణమును కల్గియుండి పరస్పర సహకారముతో కూడిన ఉదాత్త జీవనమును గడుపుచున్నవి. తేనెపట్టునందు వేరువేరు పనులకు కొన్నికొన్ని యీగలు నియోగింపబడి రాణి యీగ ఆధ్వర్యమున కర్మవిభాగ క్రమమున పని చేయుచు తేనెటీగల వలస అభివృద్ధి చెందును. చీమలు పాలనొసంగు ఒక రకమైన పురుగులను కూడ కూర్చుకొనగల్గి వాటి వలసలయందు బానిసత్వమును కూడ స్థాపింపగలిగినవి.

### మానవ సంఘ పరిణామమునందలి దశలు - అట్టి పరిణామమునకు కారణములు

సృష్టిలో అత్యుత్తమమైన స్థాయికి చెందిన వాడగుటచే

మానవుడు ఉన్నతము, ఉదాత్తము నగు తన మేధాసంపద కారణముగ నాగరికతను నిర్మించి అతిక్లిష్టమైన నిర్మాణము గల మానవ సమాజమును స్థాపించియున్నాడు. ఈ మానవ సమాజ పరిణామమునకు కారణము మానవత్వమునందు సహజముగ గల సంఘజీవనశక్తియే అయిఉన్నది. నాగరిక సమాజము స్థాపింపబడుటకు పూర్వము అతడు ప్రకృతితో పోరాడి సంపూర్ణ విజయమును బడయుటకు ఇదియే కార ణము. తన సంపదను అన్ని విధములుగ వృద్ధిచేసికొనిన మాన వుడు క్రమముగ జనాభా అభివృద్ధి చెందుటతో, క్రమమైన శ్రమ విభాగము డివిజన్ ఆఫ్ లేబర్ పై నాధారపడిన ఆర్థిక వ్యవస్థను నిర్మించి ప్రత్యేకములగు పనులకు, ప్రత్యేకమైన మేధాసంపత్తి, అభిరుచిగలవారిని నియోగించుచు వచ్చెను. క్రమముగ భాషయు, సారస్వతమును వృద్ధిచెంది, మానవుడు నాగరికుడయ్యెను.

మానవ సమాజ పరిణామమునకు తోడ్పడినవాటిలో మతము ముఖ్యమైనది. ఆదిలో మానవుడు ప్రకృతి శక్తులకు పూర్తిగ భయపడి వాని ప్రసన్నతకై బలుల నిచ్చుచుండెను. మేధస్సు పూర్తిగ వికసించని ఆ రోజులలో కలలకు అతడు చాల ప్రాముఖ్యము నిచ్చుచుండెను. కలలకు అర్థము చెప్ప గల ఒక ప్రత్యేకమైన పూజారుల కులము వ్యాప్తిలోనికి వచ్చినది. నాగరికత అభివృద్ధి చెందినకొలదియు నతడు ప్రకృతి శక్తులకు దైవత్వము నారోపించుచు ఆ దైవముల నారాధించు టకు మంత్రతంత్రములను కూర్చుకొనెను. పెద్దపెద్ద నగరము లను, రాజ్యములను స్థాపించి, తన మతమునందు చెప్పు కొన తగిన మార్పులను తీసికొనివచ్చుట మానవ సంఘ పరి

ఞానమునందలి తరువాతి దశలు. నాగరికతావతరణమునకు ఇది ఉషఃకాలము. వేదములు రచించిన ఆర్యులు; జెండు అవెస్టాకర్తలైన పర్షియనులు, హెల్లెన్నిస్టిక్ నాగరికత నిర్మించిన పగన్ గ్రీకులు వర్ధిల్లిన రోజులివి.

అన్నిటికి మించి మానవ సంఘాభివృద్ధికి కారణభూతము లైనది. అందరికి తన కుటుంబమునందు గల మక్కువ. స్వజాతియందును, స్వసంతతియందును అతనికి గల ప్రేమయే కుటుంబములును, కులములును, జాతులును అభివృద్ధిపొందుటకు గారణమయ్యెను. మానవ నాగరికతాసౌధమునకు పునాది అతనికి స్వవర్గమునందుగల అభిమానమే.

---

# మూడవ ప్రకరణము

## మానవ సంఘ నిర్మాణము

మానవసంఘనిర్మాణమునకు మనము యీ క్రింది యంశములను కారణములుగ పేర్కొన వచ్చును.

గార్హస్థ్యధర్మము:- గార్హస్థ్యము పురుష సహజ ధర్మము. అనాది నుండియు, మానవుడు స్వజనాభివృద్ధికై వివాహమును సమాజము సందలి ముఖ్యసంస్థగా అంగీకరించి యున్నాడు.

సంతతియందు ప్రేమ:- గృహస్థధర్మము స్వజాతి వృద్ధికి తోడ్పడగ మానవసంతతి పరంపరలుగ పెరుగును. అంతట క్రమముగ కుటుంబములు, జాతులు నేర్పడును. నాగరికతను నిర్మించు మానవుడు ఆస్తిని సంపాదించుచు విశిష్టములైన ఆర్థిక వ్యవస్థలను నిర్మించుకొనుచు సంపదను పెంపొందించుకొనును.

ఆస్తి - వారసత్వము:- తల్లిదండ్రులకు తమ బిడ్డల యందు సహజముగ గల ప్రేమయే శ్రమించి పనిచేయుటకు, ఆస్తులను సంపాదించి వాటిని తమ పిల్లలకు సంక్రమింప జేయుటకు కారణమగును. వ్యక్తులపట్ల వర్తించినట్లే జాతుల విషయమునను సంపద యొక్క అభివృద్ధి జరిగెను.

స్వజాతిపైగల అభిమానము:-ఒకే భాషను మాట్లాడుట, ఒకే నాగరికతను సంస్కృతిని గల్గియుండుట, ఒకే దేశమున నివసించుట జాతులు అభివృద్ధి చెందుటకు కారణముల

గును. స్వజాతీయులలో ఒకరిపై నొకరికి గల అభిమానము మానవ సమాజ పరిణామమునకును, అభివృద్ధికిని ముఖ్యము.

రక్త సంబంధములు:- జాతులను కలిపి, ఒకే జాతిని ఒకే రాష్ట్రము నందుంచుటకును, మానవ చరిత్రలో సంఘటిల్లిన అనేక దారుణ సంగ్రామములకును, జాతులమధ్య బాంధవ్యమును గలుపునదియు, పెంపొందింప చేయునదియు నగు రక్త సంబంధమే కారణము. నాజీ, జర్మనీ నేత హిట్లరు లేవనెత్తిన "ఆర్యనుల ఆధిక్యత" అను నినాదము దీనికి తార్కాణము.

మతము:- మానవ సమాజ పరిణామమునందు మతము నిర్వహించిన పాత్ర అతి ముఖ్యమైనది. మత చరిత్రయే మానవ సమాజచరిత్ర అని చెప్పుటయును సత్యదూరము కానేరదు. ప్రకృతిశక్తులకు భయపడి ఆదిమానవుడు నిర్మించుకొనిన ప్రాకృతమతము (నేచురల్ రెలిజియన్) సహితము మావునని విజ్ఞానము క్రమముగా మానవసమాజము వృద్ధి చెందుటకు తోడ్పడును.

భౌతిక పరిస్థితులు:- శీతోష్ణస్థితి, సహజసంపద, నదీనదములు, అడవులు, కొండలు, ఎడారులు మున్నగు భౌతిక పరిస్థితులు జాతులయందు ప్రత్యేక లక్షణముల నేర్పరచి, జాతుల పరిణామములకు దోహదమిచ్చెను.

సాంఘిక దృష్ట్యా మానవసంఘమును సమాజము (సొసైటీ) అని పిలిచినచో రాజకీయ దృష్ట్యా రాష్ట్రము అని అనవలెను. రాజకీయ దృష్ట్యా సంఘ నిర్మాణమే రాజ్యాం

గము. రాజ్యాంగముయొక్క పరిణామములో నాగరికతా వాతావరణమున మానవసంఘము పొందిన ఒక ఉన్నతమైన స్థితి రాష్ట్రము. మానవ సమాజమునకును, రాష్ట్రమునకును గల పరస్పర సంబంధమును తారతమ్యమును క్రమముగ పరిశీలింతము. మానవ సంఘమునను, రాజ్యాంగమునను జరిగిన పరిణామము నందలి దశలను ఇట్లు పేర్కొనవచ్చును.

కుటుంబము:- మానవ సమాజ పరిణామము నందలి ప్రథమదశ కుటుంబము. గార్హస్థ్యధర్మమును నెఱపు స్త్రీ పురుషులు తమ సంతతితో గూడి ప్రత్యేకముగ నివసించుటతో కుటుంబము లేర్పడినవి. ఈ కుటుంబములు తల్లి లేక తండ్రి యాజమాన్యమున వర్థిల్లెను, తండ్రి యజమానిగను, సర్వాధికారిగను గల కుటుంబములుగల సంఘమును పితృపాలకము అని సాంఘిక శాస్త్రజ్ఞులు పేర్కొందురు. పితృపాలక సమాజమునకు పూర్వము తల్లి యజమానిగను, సర్వాధికారిగను ఉండిన మాతృపాలక సమాజము కలదని కొందరి శాస్త్రజ్ఞుల వాదన.

కులములు:-రక్తసంబంధముగల కొన్ని కుటుంబములు కలసి కొన్ని కులములు ఏర్పడినవి. దీనితో మానవ సమాజ చరిత్రమునందలి తరువాతి దశ ఆరంభమాయెను.

తెగలు:- జనాభా అభివృద్ధి చెందుటతో రక్త బంధుత్వముగల మతముల సంఖ్యకూడ పెరుగును. ఇట్లు పరస్పర భాంధవ్యముగల కులము లనేకములు కూడి ఒక తెగ యేర్పడును.

**దేశము - ప్రజ:-** ఒక దేశమునకు చెందిన ప్రజ ఒక నిర్ణీతమైన సంస్కృతికి చెందినవారుగ నుందురు. దేశీయత ౧౭౮౯ లో ఫ్రెంచి విప్లవముతో నుద్భవించి ఇటాలియను, జర్మను రాజ్యములు క్రమముగా ఏక రాజ్యము లగుటతో పెంపొందెనని చెప్పనగును. ఈనాడు భారతదేశ వాసుల నందరిని భారతీయులుగ మనము పరిగణింతుము. మానవ సంఘ పరిణామములో మనము మొట్టమొదట పేర్కొనిన మూడు దశలకును, తరువాత దశకునుగల తారతమ్యము ముఖ్యమైనది. ఆదిమ కాలమున వేరువేరు కుటుంబములను, కులములను దగ్గరకు చేర్చిన సంబంధము రక్తసంబంధము. కాని, ఆనాటి జనులు ఏకరక్త బంధువులుగ వ్యవహరించి రనుటయు, ఒకే జాతికి చెందినవారుగ గర్వించి జీవించిరను టయు చరిత్రకు అందిన సత్యముకాదు. నాగరికత నిర్మింపబడని ఆ రోజులలో వారి జీవనము వేఱు. ఈనాడు ఒకే దేశవాసు లుగ ప్రజలు అవలంబించు ఆశయములు వేఱు. సాంఘిక శాస్త్రజ్ఞులు యీ రెండు స్థితులలోని మనస్తత్వములందలి వ్యత్యాసమును ముఖ్యమైనదిగ పరిగణింతురు.

ఈ అధ్యాయమును ముగించుటకు ముందు మానవ సమాజాభివృద్ధిపై భూగోళ పరిస్థితుల ప్రాబల్యమేమో పరిశీలింతము.

**భూమ్యుపరితలము:-** నదులు, అడవులు, కొండలు, ఎడారులు మున్నగువాని ప్రాబల్యము మానవ సమాజాభి వృద్ధిపై ఎన్నదగినదిగ నుండును. ఆది మానవుడు కొండ గుహాలలోను, అడవులలోను నివశించుచు. వేటాడి తన

ఆహారమును సంపాదించి దానిని అపక్వముగనే భుజించి జీవించుచుండెను. నాగరిక మానవులు నదీప్రాంతములయందే నివసించుచుండిరి. యూఫ్రిటిసు, టైగ్రీసు నదుల సహమ స్థాపింపబడిన సెమెటిక్ నాగరికత, నైలునదీ ప్రాంతమున వర్ధిల్లిన ఈజిప్టు, సంస్కృతి, భారత దేశమునందలి సింధునదీ ప్రాంతసంస్కృతి, ఆర్యులు గంగానదీ మైదానమున స్థాపించినఉత్కృష్ట నాగరికతలు ఇందులకు తార్కాణములు.

శీతోష్ణస్థితి:-ఒక దేశములోని వారి శరీర తత్వమును, మనస్తత్వమును నిర్ణయించుటలో శీతోష్ణస్థితి ప్రముఖ పాత్ర వహించుననుట సత్యదూరము కానేరదు. పర్వత ప్రాంతములలోనివారు శరీర ధార్ఢ్యముగలవారై యుందురు, శీతల దేశీయులు బలశాలురుగను, కష్టపడి పనిచేయువారుగను, సులభముగా అలసట చెందనివారుగను ఉందురు. మైదానములపై నివసించువారి మనస్తత్వము విశాలముగా నుండును. గంగానది మైదానమున నివసించు ఋగ్వేద కర్తలైన ఆర్యులు ఉదాత్తమైన భగవత్తత్వమును కీర్తించుట ఆశ్చర్యకరమైనది కాదు.

సహజసంపద:-నాగరికత ప్రభవించిన మొదటి రోజులలో వ్యవసాయమునకును, సరకుల ఉత్పత్తికిని తారతమ్యము లేని ఆర్థిక పరిస్థితులుగల కాలమున, నదీప్రాంతములయందే ప్రపంచ చరిత్రయందలి నాగరిక రాజ్యము లన్నియు నిర్మింపబడి వర్ధిల్లినవి. మానవ సమాజ పరిణామ చరిత్రలో టైగ్రిసు యూఫ్రిటిసు, నైలు, గంగా, సింధు నదులు నిర్వహించిన, ప్రముఖపాత్ర ఇది వరకే చదివియుంటిమి. ఆస్ట్రేలియాలోను,

ఆఫ్రికాలోను మెక్సికోలోను గల బంగారు గనులు యూరోపి యనుల చరిత్రలో ఎట్టి మార్పును తీసికొనివచ్చినది పారి శ్రామిక విప్లవమునకును, యూరోపియనులు వలసలు స్థాపించుటకును ఇది ఎట్లు దారితీసినది చరిత్ర విద్యార్థు లందరును గమనింపతగిన విషయము.

ప్రకృతి:-మానవ మనస్తత్వముపై ప్రకృతి శక్తులకు గల ప్రభావము ప్రబలమైనది. ఆదిమ మానవునకు ప్రకృతి యందలి భీభత్సమే మనోగతమై అతడు భీతిల్లి, వాని ఉప శాంతికి బలులను ఏర్పాటుచేయుట ప్రథమ దశ. కాని, తరువాత నాగరిక మానవుడు ఆ ప్రకృతి శక్తులకే దైవత్వ మారోపించి పూజించెను. ప్రపంచ విజ్ఞాన చరిత్రలో కాల క్రమేణ వర్ధిల్లిన తాత్వికుల మనస్తత్వమునకును, వారి దేశ ముల యందలి ప్రకృతి సహజ లక్షణములకును దగ్గర సంబంధము కలదు.

---

# నాలుగవ ప్రకరణము

## రాష్ట్రము : మానవ సమాజము పారమేష్ఠ్యము

ఇంతవరకును మనము మానవ సంఘ పరిణామమును సాంఘికదృష్ట్యా పరిశీలించి యుంటిమి. రాజకీయముగ మానవ సంఘమునందు కల్గిన మార్పులను కూడ పరిశీలించవలసిన ఆవశ్యకత కలదు. రాజకీయ కలాపములు సాగించుటకు నాగరిక మానవులు నివసించు భూభాగమునే రాష్ట్రము అని పిలుతురు. "ఒక నిర్ణీతమైన భూభాగమందు శాసన బద్ధమగు ప్రభుత్వముగల పౌరసముదాయమే రాష్ట్రము" అని డాక్టరు వుడ్రోవిల్సన్ నిర్వచించెను. ప్రొఫెసరు హాలండు ఉద్దేశములో "ఒక దేశమున నివసించు అశేషమైన జన సముదాయము నందు అధిక సంఖ్యాకులైన పౌరులయొక్క అభిప్రాయములు ఆలోచనలు, ఇష్టాయిష్టములు తక్కినవారి అభిప్రాయముపై ప్రాబల్యము కలిగి తద్వారా ఆధిపత్యము వహించి రాజకీయ కార్యకలాపములు కొనసాగింపబడుటయే రాష్ట్రముయొక్క లక్షణము." "ఎచ్చట మానవుల సాంఘిక కార్యకలాపములపై అధికారము వహించు శక్తులు గలవో అట్టి శక్తియే పారమేష్ఠ్యము. తానేవహించి ఇతర శక్తులకు లోబడి యున్నదో, అట్టి శక్తిని వహించిన మానవ సంఘ సముదాయమే రాష్ట్రము" అని ప్రొఫెసరు విల్లబీ అను సాంఘిక శాస్త్రవేత్త నిర్వచించెను.

పై నిర్వచనములన్నిటియందును రాష్ట్రమునకు ఆపాదింపబడిన నాలుగు సామాన్య ధర్మములు మనకు గోచరించును.

౧. ఒక నిర్ణీతమైన భూభాగము ౨. అట్టి దేశమునందు నివసించు ప్రజ. 3. నాగరిక ప్రజాసముదాయముచేత నిర్మింపబడిన సాంఘిక ప్రభుత్వము. ౪. సారభౌమత్వము.

భూభాగము:-ప్రత్యేకము, నిర్ణీతమయిన భూభాగము లేక ఏ ప్రజయు రాష్ట్రము నేర్పాటు చేసికొనజాలదు. తమ పశువులకును, తమకును ఏ కాలములో ఎక్కడ ఆహారము దొరుకునో, ఆప్రాంతములకెల్ల పోవుచు దేశద్రిమ్మరులుగా జీవితమును సాగించిన రోజులలో మానవులు రాష్ట్రమును నిర్మింపలేకపోయిరి. కాన రాష్ట్రమునకు కావలసిన ముఖ్యలక్షణములలో భూభాగమే మొదటిది. ఇస్రాయిలు రాష్ట్రస్థాపనమునకు పూర్వము ప్రపంచము నంతటను చెదరి జీవించుచుండిన జ్యూలు నవీన రాజ్యాంగ చరిత్రయందు రాష్ట్రములేని ప్రజకు తార్కాణముగ నుండిరి.

ప్రజ:- ప్రజలచే నివసింపబడుటకు యోగ్యముగాని సహారా, గోరీ ఎడారులు హిమాలయ ప్రాంతములు రాష్ట్రములుగ రాజకీయ శాస్త్రజ్ఞులు అంగీకరింపజాలరు.

ప్రభుత్వము:-నాగరిక మానవ సంఘమును రాజకీయ సమాజముగ మార్చునది రాష్ట్రమునకు గల యీ లక్షణమే. నిర్ణీతమైన భూభాగముండినను అట్టి ప్రాంతమున జనులు నివసించుచుండినను వారు ప్రత్యేకమైన ఒక అధికారమునకు లోబడియుండనిదే రాష్ట్రము ఏర్పాటు కాజాలదు. ఇంటను, బయటను, ఒక దేశముయొక్క సార్వభౌమత్వమును సంరక్షించునది ప్రజలకు న్యాయమునిచ్చి ధర్మమును నెలకొల్పునది ప్రభుత్వమే.

పారమేష్ట్యము:- రాష్ట్రమునకు మానవ సంఘము నందలి తక్కిన ఇతర సంఘములకు గల భేదమునకు కారణము—రాష్ట్రము వాటిపై సార్వభౌమత్వమును వహించుటయే. ఒక రాష్ట్రమునందలి శ్రామికులు వారి వృత్తి సంఘము యొక్క అధికారమునకు లోబడియుండి నడచుకొనవచ్చును. కాని రాష్ట్రముయొక్క ఇష్టాయిష్టములకును వృత్తి సంఘము యొక్క అభిరుచులకును సంఘర్షణ ఏర్పడినచో రాష్ట్ర శాసనమే అమలు జరుగును. రాష్ట్రమునకుగల యీ లక్షణమునే సార్వభౌమత్వము అని అందురు. సాంఘిక శాస్త్రజ్ఞులు కొందరు సార్వభౌమత్వమును రాష్ట్రమునకు తన దేశముల తోడి సంబంధ బాంధవ్యములలో రాష్ట్రమునకుగల సర్వాధికారము అని రెండుగా విభజింతురు. ప్రొఫెసరు లాస్కీ మున్నగు పండితులు, రాష్ట్రము ఇతర రాష్ట్రముతోడి సంబంధ బాంధవ్యముల విషయమున గూడ సర్వాధికారమును విడనాడి ఏదేని అంతర్జాతీయ కూటమికి, అట్టి అధికారమును సంక్రమింపచేయు వఱకును ప్రపంచశాంతి కలుగజాలదని స్పష్టీకరించుచున్నారు.

రాష్ట్రము : పారమేష్ట్యము:— "నిర్ణీతమైన ప్రభుత్వాధికారమునకు లోబడి నాగరికులైన ప్రజలు నివసించుటకు అనుకూలమైన భూభాగమే రాష్ట్రము" అని నిర్వచించినచో అట్టి రాష్ట్రమునకు గల సర్వాధికారమే సార్వభౌమత్వము. ప్రభుత్వముద్వారా చట్టములు రాష్ట్రము యొక్క ఇష్టాయిష్టములు అమలు జరుగుచుండును.

రాష్ట్రము : మానవ సమాజము :- రాజకీయముగ రాష్ట్రమునకు గల సర్వాధికారమే సార్వభౌమత్వమని. రాష్ట్రమునకు ఆపాదింపబడిన లక్షణములలో ఇది చాలా ముఖ్యమైనదని, మానవ సమాజమునందలి ఇతర సంఘములకు రాష్ట్రమునకు గల భేదమునకు రాష్ట్రమునకు గల యీ లక్షణమే కారణమని తెలిసికొని యుంటిమి. మానవ సమాజమునందు వృత్తి సంఘములు, మత సంస్థలు రాజకీయ పక్షములు మున్నగు సంఘములు ఎన్నియో గలవు. మానవ సమాజ సందర్భమున ఇట్టి సంఘములన్నియు సహజభాగములని హాబ్స్ అను నతడు వచించెను. ఇట్టి సంఘములకు రాష్ట్రమునకు గల సర్వాధికారములేదు. రాష్ట్రము కాని, యీ సంఘములయొక్క సభ్యులు రాష్ట్రముయొక్క అధికారముతో వైరుధ్యమేర్పడ నంతవరకును తమ తమ సంఘములయొక్క అనుజ్ఞలను పాలించుటకును అభిరుచులను అమలు జరుపుటకును వీలుపడును. వాస్తవముగ ప్రజాస్వామిక ప్రభుత్వ విధానమునందే ఇట్టి స్వాతంత్ర్యము లభ్యము. ప్రస్తుతము బోల్షివిక్కు రష్యాయందును ద్వితీయ ప్రపంచ సంగ్రామమునకు పూర్వము నాజీ జర్మనీ, ఫాసిస్టు ఇటలీల యందును రాష్ట్రముయొక్క పారమేష్ట్యము అపరిమితమై యుండెను. పైన చెప్పబడిన దేశములయందు రాష్ట్రమే సమాజము. సమాజమే రాష్ట్రము. ఈ రాజ్యములలో చెల్లుబడియగు నీతి శాస్త్రము ననుసరించి రాష్ట్రమునకును మానవ సమాజమునకును భేదము గుర్తింపబడలేదు. ఇట్లు మానవ సమాజమునందలి అనేక సంఘములలో ఒకటిగా కాక రాష్ట్రమే మానవ సమాజముగా పరిగణింప బడుచుండును.

# ఐదవ ప్రకరణము

## సంఘము నందలి వివిధ వర్గములు.

ఒక దేశము నందలి ప్రజలును, సమాజమును కొన్ని వర్గములు లేక తరగతులుగ గాని, కులములు వర్ణములుగ గాని విభజింపబడి యుండును. ఇట్టి వర్గీకరణమునకు కారణము లనేకములు.

ఉదాహరణమునకు:– ౧ ఆర్యులు హిందూదేశముపై దాడి వెడలి ద్రావిడులను వశపరచుకొని నప్పుడును, నార్మనులు ఇంగ్లండును జయించి ఆంగ్లోసాక్సను జాతులపై ఆధిపత్యము వహించినప్పుడును, ఇటీవల ఆంగ్లేయులు భారతీయులను పాలించిన పట్టునను భారతదేశమునను, ఇంగ్లండు దేశమునందును ప్రజలు పాలితులు, పాలకులు అని రెండుతరగతులుగ విభజింపబడుట సంభవించెను. ఆర్యులు తాము జయించిన ద్రావిడులను దస్యులు లేక దాసులు అని వ్యవహరించుచు తాము నిర్మించుకొనిన వర్ణవ్యవస్థయందు వారినినాలుగవ జాతివారుగ పరిగణించిరి. నార్మన్ విజయము కారణముగ ఇంగ్లండు చరిత్రయందును, ఆంగ్లోసాక్సను జాతులవారి హోదాయందును ముఖ్యమైన మార్పువచ్చెను. నార్మనుల నాయకుడు, మొదట విలియము ప్రవేశపెట్టిన భూస్వామిక విధానమున ఆంగ్లోసాక్సనులు క్రింది సోపానములయందే ఉండుట సంభవించెను. రోమనులు సామ్రాజ్యాధిపత్యమును నెఱపిన రోజులలో తాము ప్రభువులుగా ఒక ప్రత్యేక వర్గము నేర్పరచు కొనిరి. ఇట్లు వర్గచరిత్ర యందు దండయాత్రి నిర్వహించిన పాత్ర ముఖ్యమైనది.

ఆర్థిక పరిస్థితులు:- వర్గములు లేక కులముల నిర్మాణమునకు ఆర్థిక పరిస్థితులును చాలవరకు కారణములగును. వాస్తవముగ నార్మనులు ఇంగ్లండున ప్రవేశపెట్టిన ఫ్యూడలు విధానము ఆర్థిక సంస్థయే. ఈ భూస్వామిక విధానమున భూములు కోల్పోయి కేవలము శ్రామికులుగ మాత్రమే జీవించువారు పూర్తిగా ఆంగ్లోసాక్సను జాతివారే యై యుండిరి. రోమ్ చరిత్రయందును ప్లెబియనులు, పెట్రిషియనులు అని సమాజము వర్గీకరింపబడి యుండెడిది. ఇవి కేవలము ఆర్థిక పరిస్థితులవలన కల్గిన విభాగములు. నవీనయుగమున పెట్టుబడిదారీ విధానము కారణముగా ఆర్థిక పరిస్థితులు ప్రజా జీవితమున విశేషమైన మార్పును తెచ్చి మానవ సమాజమును పెట్టుబడిదారీ వర్గము, శ్రామికులు అని రెండుగా విభజించినది.

భారతదేశమునందలి వర్ణ విభాగములు:- ఋగ్వేద కాలమునాటి ఆర్యులు కుల నిర్మాణము చేసినరీతి అతి విచిత్రమైనది. మొదట వృత్తి భేదము ననుసరించి వర్ణ విభాగము జరిగియుండెను. రాజ్యపాలన, వాణిజ్యము, వ్యవసాయము చేయు జాతులు క్షత్రియ, వైశ్య, శూద్రులుగ వర్గీకరింపబడగా, బ్రాహ్మణులు అట్టి మానవ సమాజమునకు మేధస్సుగా నుండిరి. కాని బౌద్ధ, జైన మతముల అవతరణ కాలము నాటికి ఇట్టి వర్ణక్రమ విభాగము లనేకములైన చెడుగులకు ఆలవాలమాయెను. ముఖ్యములగు నాలుగు వర్ణములేగాక ఇంకను అనేక శాఖలుగా భాగింపబడి, వివాహ భోజన విషయములలో యీ వర్ణములకు శాఖలకు చెందిన వారి నడుమ అడ్డంకులేర్పడి హిందూ సమాజమంతయు పతనస్థితికి

వచ్చుచుండుటయు చరిత్రలో వేలువేలు కాలములయందు సంస్కరణవిధానముగా వారు సంస్కర్తలు "యుగేయుగే" జనించుటయు చరిత్ర విద్యార్థులు పఠించు అంశమే.

అటులని వర్ణ విభాగము భారతీయులకేమియు లాభము కూర్చలేకపోయినదని కాదు. అనేక దండయాత్రలకు యీ దేశము గురియైనప్పటికిని యీ దేశమునందలి సమాజము భిన్నభిన్నము కాక నిలచినచో అందుకు గల మెప్పు కుల విభజనకే చెందును. వృత్తి విద్యలను కళలను కుటీర పరిశ్రమల యందలి నేర్పును వంశక్రమాను గతముగ నేటికిని సమాజమున నిలచునట్లు చేసినది యీ వర్ణవిభాగమే. వర్ణముల మధ్య అసూయ, ద్వేషము కల్గుట సంభవించినను పరదేశ దండయాత్ర సమయముల యందు భారతీయులందరును కలసియే శత్రువుల నెదిర్చియుండిరి. కాని నవీన సమాజమున వర్ణ విభాగము వృత్తులననుసరించి చేయుట సంభవము కాజాలదు. చరిత్ర ప్రసిద్ధమైన లాభములు కల్గినప్పటికిని వర్ణవిభాగములు తొలగి అంతకన్న ఉన్నతమైన సమాజమునకు తావొసంగవలెను.

---

# ఆరవ ప్రకరణము

## పౌరసత్వము : హక్కులు : బాధ్యతలు

పౌరసత్వభావము:- ఒక రాజ్యమునందు నివసించు ప్రజలను పౌరులు అనగా సిటిజన్స్ అని, ఇతరులు అని, రెండు విధములుగ విభజింపనగును. కొన్ని హక్కులను కలిగి యుండి, బాధ్యతలను నిర్వహించుచు ఒక రాజ్యమునందు శాశ్వతముగా నివసించుటకు వీలుగల్గిన వాడే పౌరుడు. పౌరులు కానివారు తాత్కాలికముగ తాము నివసించుచున్న దేశ ప్రభుత్వముయెడల భక్తి కలిగియుండరు. వారు ఆ దేశ మునందు అతిధులవంటివారు మాత్రమే. వీరు ఎన్నికలలో పాల్గొని ఓటు చేయుట, ప్రజాప్రాతినిధ్యము వహించుట, ఉద్యోగములు నిర్వహించుట చేయజాలరు.

తాత్కాలికముగ దేశమునందు నివసించు ఇతర దేశీయులు గాక ప్రతి రాజ్యమునందును వేరొక తరగతికి చెందిన వారు కూడ ఉందురు. వీరిని మనము సబ్ జెక్ట్స్ అని పిలువ వచ్చును. ప్రత్యేక కారణములచే పౌరులు అనుభవించు హక్కును కాని, బాధ్యతలనుకాని వీరు కల్గియుండరు. వర్తక వ్యాపారములలో దివాలా తీసినవారు, పిచ్చివాండ్రు, తీవ్రమైన అపరాధమునకు దీర్ఘశిక్ష బడసినవారు మైనర్లు యీ వర్గమునకు చెందినవారు.

తాను శాశ్వతముగ నివసించుచున్న రాజ్యము నెడల భక్తిప్రపత్తులు కల్గియుండి ఇతరుల స్వాతంత్ర్యమునకును

హక్కులకును భంగము కలిగింపని స్వాతంత్ర్యము, హక్కులు అనుభవించుచు ఆ దేశములో తాను కల్గియుండిన ఆస్తిని ఇతరములగు రాజకీయ హక్కులను అనుభవించుచు, ఎన్ని కలలో ఓటు చేయుట, అభ్యర్థిగ నిలచుట, పెద్దఉద్యోగములు నిర్వహించుట మున్నగునవి నిర్వహించుచు ఆ దేశ ప్రభుత్వము ఒసంగు రక్షణ క్రింద జీవించుచు, ఆ రాజ్యమునొక్క ఉచ్చనీచకాలములలో రాజ్యసంపదయందును కష్టనిష్ఠూరముల లలోను భాగస్వామి అయి పౌరధర్మములను నిర్వహించు వాడే పౌరుడు.

చారిత్రాత్మకముగ పౌరసత్వభావము (సిటిజన్ షిప్) క్రమమైన మార్పును పొందుచు వచ్చినది. అరిస్టాటిలు నిర్ణయ ప్రకారము పౌరసత్వభావము పట్టణవాసులకు మాత్రమే చెంది యుండెను. గ్రీకు రాజ్యాంగ విధానము పట్టణ రాజ్యాంగ ములుగా నుండుటయే దీనికి కారణము. ఇంతేగాక పౌరులుగ గుర్తింపబడని బానిసలు గ్రీకు ప్రజలలో ఒక భాగముగ నుండిరి. ఫ్రెంచి రష్యన్ విప్లవములు, పారిశ్రామిక ప్రపంచములోని చైతన్యము, రాజకీయ రంగములోని సంచలనము కారణముగ పౌరసత్వ భావమునందు విప్లవకరమైన మార్పు కలుగుచు వచ్చినది. అమెరికాలో నీగ్రోజాతివారి హక్కులు భారతదేశమునందు మన రాజ్యాంగము ప్రకారము యీనాటి వరకు అస్పృశ్యులుగ చూడబడిన కడజాతి వారు అనుభవించు సౌకర్యములు తెక్కిన పాశ్చాత్య ప్రపంచమున స్త్రీలు కూడ పురుషులతో సమాన ప్రతిపత్తికే సాగించుచున్న పోరాటము దీనికి తార్కాణము.

పౌరసత్వ భావము:- పౌరులు అనుభవించు హక్కులను మనము ముఖ్యముగ రెండు విధములుగ చెప్పుకొనవచ్చును. ౧. దేశమునందలి న్యాయస్థానము లొసంగెడు రక్షణ, న్యాయము. ౨. ఎన్నికలలో ఓటు చేయుట, అభ్యర్థిగా నిలచుట మొదలగు రాజకీయ హక్కులను కలిగియుండుట.

ప్రతి రాజ్యము నందును రెండు విధముల పౌరులను మనము చూచుచున్నాము. ౧. పుట్టుక చేతనే పౌరులుగ నుండినవారు. ౨. చట్టము చేత పౌరులైనవారు. ఒక దేశము నందు జన్మించి ఆ దేశవాసులేయైన పౌరులను తల్లి తండ్రులుగా కల్గియుండిన వాడు పుట్టుక చేతనే పౌరసత్వము పొందినవాడు. పుట్టుకచే ఇతర దేశ వాసులైనను పర దేశమునందు తాము పొందియున్న పౌరసత్వమును వదలి తాము తాత్కాలికముగా నివసించుటకు వచ్చిన దేశమునందలి పౌరసత్వమును శాశ్వతముగా బడయుటకై శ్రమించి పౌరులైనవారు. పెంపకము వలన పౌరసత్వమును పొందినవారు కొన్ని విధింప బడిన విధులను నిర్వహించుటచే జన్మతః పర దేశీయులైన వారును, వేరొక దేశముయొక్క పౌరసత్వమును పొందవచ్చును. మొత్తము మీద పౌరసత్వమును పొందు విధానమును మన మిట్లు పేర్కొనవచ్చును.

పుట్టుక:- ఒక రాజ్యము యొక్క సరిహద్దులలో ఆ రాజ్య పౌరులైన తల్లిదండ్రులకు పుట్టినవాడు. ఇప్పట్టున మన మొకరి విషయమును జ్ఞప్తియందుంచు కొనవలెను. ఆంగ్లేయ న్యాయవిధానము, ప్రకారము ఆంగ్లేయ నావపైగాని, ఆంగ్లేయ విదేశ కార్యాలయమున కాని జన్మించినవారు

ఆంగ్లేయపౌరులే అగుదురు. అయినను జన్మతః లభించు పౌర సత్వ విషయమున ఒకే విధమైన నియమము అన్ని రాజ్యము లందును కానరాదు. జర్మనీ, స్వీడను, స్విడ్జర్లాండు దేశముల చట్టముల ప్రకారము ఏ రాజ్యపు సరిహద్దులందు పుట్టినను సరే జర్మను, స్వీడన్, స్విస్సు తల్లిదండ్రులకు పుట్టిన బిడ్డలు క్రమముగా జర్మను, స్వీడన్, స్విస్సు పౌరులే యగుదురు. ఇచ్చట తల్లిదండ్రుల పౌరసత్వముపై బిడ్డల పౌరసత్వము ఆధారపడి యున్నది. కాని అర్జంటైనా న్యాయశాస్త్ర ప్రకారము అర్జంటైనా యందు జన్మించిన కారణమున ఆ బిడ్డ అర్జంటైనా పౌరుడే యగును. అర్జంటైనా దేశీయులైన తల్లిదండ్రులకు విదేశములో జన్మించిన బిడ్డలు ఇట్లే అర్జంటైనా పౌరులు కాజాలరు. ఇప్పట్టున పౌరసత్వము పుట్టిన ప్రదేశముపై ఆధారపడి యున్నది. ఆంగ్లేయ అమెరిక నుల చట్టముల ప్రకారము ఇతర దేశీయులైన పౌరులకైనను, తమ రాజ్య సరిహద్దులలో జన్మించిన బిడ్డలు, తమ దేశీయు లైన పౌరులకు ఇతర రాజ్యముల సరిహద్దులలోనైన జన్మిం చిన బిడ్డలు కూడ, ఆంగ్లేయ, అమెరికను పౌరులే యగు దురు. ఫ్రెంచి చట్టముల ప్రకారము ఫ్రెంచి పౌరులను తల్లి దండ్రులు గలవారందరు ఏ రాజ్య సరిహద్దులలో పుట్టినను ఫ్రెంచి పౌరులే యగుదురు. కాని విదేశీయులకు ఫ్రెంచి రాజ్య సరిహద్దులలో పుట్టినబిడ్డలు ఫ్రెంచి పౌరులు కావలె ననిన, మెజారిటీ వచ్చిన సంవత్సరము లోగా బడయవలెను.

చట్టము వలన పౌరసత్వమును బడయుట:- చట్టము వలన పౌరసత్వమును బడయుట అనేక విధములుగా జరుగ వచ్చును. ఇందు ముఖ్యమైన వానినిట్లు పేర్కొన నగును.

వివాహము:-పర దేశీయురాలైన స్త్రీ వేరొక దేశమునకు చెందిన పురుషుని పెండ్లాడుట వలన భర్త దేశమునకు సంబంధించిన పౌరసత్వమును పొందును. జర్మను దేశీయుని పెండ్లాడిన ఆంగ్లేయ స్త్రీ జర్మను దేశపు పౌరసత్వమును సంపాదించినదగును.

ఇతర దేశీయులు అందు నివసించుట:-చాలా రాష్ట్రములయందు ఆ దేశమున చాలాకాలము నివసించిన కారణమున పర దేశీయులకు పౌరసత్వము నొసంగుదురు.

ప్రభుత్వోద్యోగములను నిర్వహించుట:—కొన్ని దేశములయందు ఉన్నతమగు ప్రభుత్వ ఉద్యోగములను నిర్వహించిన కారణముగా పౌరసత్వ హక్కులను పొందనగును.

ఆస్తులను సంపాదించుట:- మెక్సికో వంటి కొన్ని దేశములయందు భూమి మొదలగు స్థిరాస్తులను సంపాదించిన కారణముగా పౌరసత్వమును బడయవచ్చును.

అక్రమ సంతానము:— అక్రమ సంతానము మొదట తల్లియొక్క దేశమునకు సంబంధించిన పౌరసత్వమును కల్గియున్నను తండ్రి గుర్తింపబడిన తర్వాత తండ్రి యొక్క దేశమునకు సంబంధించిన పౌరసత్వమునే పొందును.

పెంపకము:— ఫ్రెంచి దేశమునందు ఇతర దేశీయుల బిడ్డలు మైనారిటీ దాటిన సంవత్సరములోగా ఫ్రెంచి పౌరులు కావలెననినచో ఫ్రెంచి పౌరులు కావచ్చును.

రాజ్యము శత్రు గతమగుట:— పర ప్రభుత్వము ఒక రాజ్యము నాక్రమించునెడ, ఆ రాజ్యమునందలి ప్రజలెల్లరు పౌరసత్వమునందు మార్పును పొందిన వారగుదురు.

దరఖాస్తు :— సామాన్యముగ విదేశీయులగు వారు తాము పౌరసత్వము పొందదలచిన దేశముయెడ భక్తి శ్రద్ధలు చూపెదమని ప్రమాణము చేయుచు కొన్ని నియమముల సంతృప్తి పఱచి దేశ ప్రభుత్వమునకు దరఖాస్తు చేసినచో ఆ దేశముయొక్క పౌరసత్వమును పొందగల్గుదురు.

ఇట్లు పుట్టుక వలనగాక పెంపకము వలన పౌరసత్వమును పొందుటలోను రెండు విధములగు తేడాను మనము గమనింపవచ్చును. ఇంగ్లండు దేశమునందు మంత్రివర్గము వారొసంగు పౌరసత్వమునకు తేడా గలదు. మొదటి తరగతికి చెందిన పౌరసత్వమును Naturalization అన్నాము. రెండవ తరగతికి చెందిన Denization అనియు పిలుచుట కలదు. ఇందు మొదటి తరగతి ననుసరించి పౌరసత్వమును పొందిన పౌరుడు అన్ని హక్కులను కలిగి యుండును. కాని రెండవ తరగతివారు ప్రీవీ కౌన్సిలు మెంబరుగా కాని, పార్లమెంటు సభ్యుడుగ గాని చక్రవర్తినుండి భూదానమును గ్రహించుటకు గాని అర్హుడు కాజాలడు. ఇట్లే ఫ్రెంచి దేశమునందును Grand Naturalization అనియు Naturalization ordinray అనియు భేధము పాటించుట కలదు. ఏ దేశమునందైనను పౌరుడు పెంపకము పొందదలచినవారు కొంత కనీసకాలము ఆదేశము నందు నివసించుచుండుట ఆవశ్యకము. అమెరికా సంయుక్త

రాష్ట్రములయందు పెంపకము పొందిన పౌరుడు ఎట్టి రాజకీయ సాంఘిక హక్కులనేని అనుభవింపగలడు కాని, అమెరికా అధ్యక్షుడు కాని, ఉపాధ్యక్షుడు కాని కాజాలడు. ఏమైనను, చట్టము ద్వారా పౌరసత్వమును పొందదలచిన పౌరుడు తాను దేశమునందు వాటిని త్యజించి రెండవ దేశమునందు భక్తి శ్రద్ధలు కల్గియుండెదనని ప్రమాణము గైకొనవలెను. రెండు రాజ్యములలో ఒకేసారిగా ఎవ్వరును పౌరులుగా నుండ నర్హులు కారు.

పౌరసత్వము పోవుటకును కొన్ని కారణములనే చెప్ప వచ్చును. ౧. ఒక స్త్రీ పర దేశీయుడైన పురుషుని వివాహ మాడుటవలన, ౨. వేరొక దేశమునందు అత్యున్నతములైన ప్రభుత్వ పదవులందు నియోగింప బడుటవలన, 3. ఇతర దేశ ముల నుండి బిరుదులు కితాబులు బడయుటవలన, ४. స్వదేశ మును వదలి చాలకాలము పర దేశీయులతో నివసించిన కార ణముచేత, ౫. ఇతర దేశము యొక్క ప్రభుత్వము నెడ భక్తి శ్రద్ధల ప్రకటించెదనని ప్రమాణమాచరించి పెంపకము పొందుట వలన, ౬. యుద్ధశాఖలగు సైన్యము నుండి గాని నావికా దళమునుండిగాని పారిపోవుట వలన, ౭. తీవ్రమైన అప రాధముల కారణముగ దీర్ఘమగు శిక్షనుబడయువలన పౌరుడు తన పౌరసత్వహక్కులను పోగొట్టుకొనిన వాడగును. కాని పై చెప్పబడిన వాటన్నిటి యందును — తను అంతదనుక చెందిన దేశమున పౌరసత్వ హక్కులు త్యజించి, ఇతర దేశపౌరుడుగా భక్తి శ్రద్ధలు ప్రకటించి తనంతతాను పౌరసత్వమును ఒక దేశమున వదలుకొని స్వేచ్ఛగ ఇంకొక దేశమున పొందుటయే సక్రమమైన మార్గము. నవీన భారత రాజ్యాంగ విధానము

ననుసరించి ౧. భారత దేశమునందు పుట్టినవారికి, ౨. తల్లి దండ్రులలో ఎవ్వరేని భారతీయులైనవారికి, ౩. జనవరి ౨౬, ౧౯౫౦ కి పూర్వము కనీసము ౫ సంవత్సరములయినను భారత దేశము నందు నివసించుచుండినవారికి మాత్రమేగాక, ౪. అలజడికి ఆటపట్టులైన రోజులలో పాకిస్తాన్ నుండి కాందిశీకులుగా భారత దేశమునకు వచ్చినవారికి కూడ పౌరసత్వమును పొందు అధికార మొసంగబడెను.

సత్పౌరుని లక్షణములు:- విద్యా వివేకములు కలిగి యుండి రాజకీయ పరిజ్ఞానముతో, దేశ పరిస్థితుల నవగాహన చేసికొనుచు తనకు గల రాజకీయ సాంఘిక హక్కులను సంఘ క్షేమమునకై వినియోగింపగల వ్యక్తిని మనము సత్పౌరునిగా పేర్కొన వచ్చును. మంచివాడైనంత మాత్రమున కాని, దేశమునందు గొప్పవాడైనంత మాత్రముచేత గాని ఒక వ్యక్తి సత్పౌరుడుగ పరిగణింప బడజాలడు. భగవద్భక్తి, సత్యసూక్తి మున్నగు సద్గుణములచే ఒక పౌరుడు అలరారుచు గొప్ప వేదాంతిగా అతడు దేశమున పేరు బడయువచ్చును. మరియొక వ్యక్తి గొప్ప కవిగ గాని, వేరొకరు గొప్ప శాస్త్ర వేత్తగ గాని పేరొందవచ్చును. కాని వేదాంతిగను, కవిగను, శాస్త్రవేత్తగను, వారెవ్వరును సత్పౌరులు కాజాలరు. సత్పౌరుని లక్షణములను లార్డు బ్రైసు చెప్పిన ప్రకారము ఇట్లు పేర్కొననగును.

వివేకము:- ప్రజాస్వామిక రాజ్యములో వివేకవంతులును తెలివి తేటలు గలవారును అగు ప్రజలే రాజ్యమును

నడిపించు ఉద్యోగముల యందుండి పరిపాలనా క్రమమును సాగించుచుందురు. దేశ క్షేమమును అర్థము చేసుకొని ప్రజా మోదము బడయ గల్గునవియు విజయవంతమగు నవియునైన ప్రణాళికల నేర్పరచుట, అవగాహన చేసికొని అమలు పర చుట ప్రజాస్వామిక రాజ్యమునందు ప్రముఖ ప్రాత వహించుట పౌరునికి ఎంతేని అవసరము. ఇట్లు ప్రజాస్వామ్యములందు విద్యావివేకములు కల్గియున్న సత్పౌరులే దేశ క్షేమము నరసిన వారై మంచి పేరు సంపాదించి, దేశ సేవయు చేయ గలిగి యుందురు.

ఆత్మనిగ్రహము:-తన బాగోగులు, కుటుంబ క్షేమము మున్నగు విషయములను దేశము యొక్కయు రాజ్యము యొక్కయు క్షేమముల, తరువాత వానిగనే భావించువాడే సత్పౌరుడగుట వలన అట్టివానికి ఆత్మనిగ్రహ మెంతేని అవస రము. ఇదిగాక ప్రజామోదము, ఎన్నికలు, ప్రజాసమూ హము వాటి పైననే ఆధారపడి విజయవంతమగు ప్రజా స్వామిక రాజ్యములలో "ఎటుగాలివీచిన" అటు లాగుకొని పోబడువాడు సత్పౌరుడు కాజాలడు. తుచ్ఛములును, సంకుచిత ములును అగు ఆశలకు వశవర్తిగాక వివేకముచే దేశ క్షేమము నరయగల్గెడి తెలివితేటలు గలవాడే సత్పౌరు డనబడుటకు అర్హుడు.

కర్తవ్యముయెడల శ్రద్ధ:- ప్రతి పౌరుడు తనకు విధింప బడిన హక్కులను అనుభవించ నర్హమైన బాధ్యతలను సమ గ్రముగను సంపూర్ణముగను అర్థము చేసికొనిననాడే సంకు చితములగు ఆశలను జయించి దేశ క్షేమమున కవసరమగుచో

తన క్షేమమును బలిదానము గావించి సత్పౌరుడుగా అందు ఉన్నతోద్యోగముల నిర్వహించి లంచగొండియు, ఆశ్రితు లనువారు పొందుటకు అర్హతలేని ఉద్యోగములను ఒసంగి ఆదరించువాడును గాక విద్యుక్తధర్మమును నెఱవేర్చువాడుగ నుండవలెను.

సత్పౌరునిగా ఒక పౌరుడు రాణించలేక పోవుటకు గల కారణములను లార్డుబ్రైసు ఇట్లు నిశ్చయించెను.

అజ్ఞానము:- విద్యా వివేకములు కలిగియున్ననాడు పరిస్థితులను, రాజకీయ సాంఘిక వాతావరణమును, అవ గాహన చేసికొనగల జ్ఞానముండును. ఎంతటి సదుద్దేశములు కల్గియున్నను, పౌరుడు రాజకీయ పరిజ్ఞానమును దేశస్థితిగతుల నవగాహన చేసికొనగల శక్తియు లేనియెడల సత్పౌరుడుగ తనకు సంఘము యెడను రాజ్యమునెడను గల బాధ్యతలను సంపూర్ణముగా నిర్వర్తింపజాలడు. ప్రజాప్రాతినిధ్యముపై ఆధారపడి పరిపాలనాక్రమము సాగు ప్రజాస్వామిక రాజ్యాల యందు అధిక సంఖ్యాకులు విద్యావివేక శూన్యులై నిరక్షు రాస్యులుగ నున్నచో దేశమును అట్టి దేశమునందలి సాంఘిక వ్యవస్థయు చాల కాలము నిలువజాలవు. అరిస్టాటిలు ప్రజా స్వామ్య పద్ధతికి వికృతిగా "మాబాక్రసీ" అని వర్ణించిన రాజకీయ స్థితి ఇట్టిదే. కాన ప్రజాస్వామ్య పద్ధతి వర్ధిల్లు రాష్ట్ర ములయందు ప్రభుత్వము యొక్క ముఖ్య కర్తవ్యము ప్రజను జ్ఞానవంతులుగను, వివేకము గలవారుగను చేయుటయే. భారత దేశ మీనాడు ప్రజాస్వామ్య మార్గమున పురోగమించు చున్నది. ఇట్టి తరి, మన దేశమునందు చదువుకొనిన వారి

సంఖ్యను ప్రపంచము నందలి ఇతర దేశములలో చదువుకొనిన వారి సంఖ్యతో పోల్చి చూచుట అవసరము.

| దేశము | | చదువుకొన్నవారి సంఖ్య శాతములలో |
| --- | --- | --- |
| అమెరికా సంయుక్తరాష్ట్రములు (౧౯౩౦ లెక్కల ప్రకారము) | :— | ౯౫. ౭ |
| ఇటలీ ౧౯౨౧ లెక్కల ప్రకారము | :— | ౭౩. ౨ |
| రష్యా ౧౯౨౫ లో | :— | ౫౨. ౦ |
| .... ౧౯౨౬ లో | :— | ౮౭. ౦ |
| గ్రీసు ౧౯౨౬ లో | :— | ౫౭. ౦ |
| స్పెయిన్ ౧౯౨౩ లో | :— | ౫౭. ౧ |
| పోర్చుగల్ ౧౯౨౦ లో | :— | ౩౫. ౦ |
| ఇండియా ౧౯౩౧ లో | :— | ౮. ౦ |
| ...... ౧౯౪౧ లో | :— | ౧౧. ౧౩ |

రాజకీయ చైతన్యము లేకుండుట:- ప్రజలు ఎంతటి వివేకవంతులును విద్యావంతులును జ్ఞానులు అయినను రాజకీయ చైతన్యము కలిగియుండినవారైననాడే సత్పౌరులుగా వారు తమ విధులను నిర్వహింప గలుగుదురు. గొప్ప గణిత శాస్త్రజ్ఞుడుగాని, మహామేధావియు వేదాంతియు నైనవారు గాని, గొప్ప శాస్త్రవేత్తగాని, పేరుగాంచిన కవిగాని, లేదా సామాన్య కార్మికుడు గాని తమతమ చిన్న ప్రపంచములో తాము నివసించుచు దేశ వ్యవహారములతో జోక్యము కలిగించుకొననినాడు వారు సత్పౌరులు కాజాలరు. పరిపాలనా

వ్యవహారములతో తమకు సంబంధము లేదనియు, ఎన్నికలు ఎన్నడో వచ్చి ఎటో పోవుననియు, వాటితో జోక్యము లేద నియు తమతమ ప్రపంచములో నివసించువారు మేధావులయి నను సామాన్యులయినను ప్రజాస్వామ్య విధానము చక్కగ సాగుటకు తోడ్పడజాలరు.

స్వార్థము, సంకుచితములైన ఆలోచనలు:- దేశ క్షేమమునకైగాక, సంకుచితమును సంపూర్ణముగ స్వార్థ ముతో కూడినట్టిదియు అయిన దృక్పథముతో అర్హులుగాని వ్యక్తులకు ఎన్నికలలో తమ ఓటు నొసంగు వారును కులమత కక్షలను పాటించుచు రాజకీయ రంగమున సాంఘిక జీవిత మును మలినపరచువారును ప్రజాస్వామ్య విధానమునకు విరోధులు.

రాజకీయ పక్షములు:- రాజకీయ పక్షములు సామా న్యముగ దేశ క్షేమమునకు భంగకరములు కావు. వాస్తవ ముగ రాజకీయ పక్షములు చక్కగ నిర్మింప బడుటపైననే ప్రజాస్వామ్యముయొక్క విజయము ఆధారపడి యున్నది. వ్యక్తిగతముగ సంకుచితమైన దృక్పథము పౌరునికి ఎట్లుండ రాదో, అట్లే రాజకీయ కక్ష్యలును స్వార్థమును విడనాడి, దేశము యొక్క అభ్యుదయములనే తమ కార్యక్రమము నందును, పార్టీ ప్రణాళికయందు ప్రధాన విషయములుగ పరిగణింపవలెను. అట్లు కానినాడు రాజకీయ కక్షలు మలిన భూయిష్ఠములై లంచగొండితనము, ఆశ్రితులను మాత్రము పైకి లేవనెత్తుట వంటి దుష్టప్రవృత్తు లలవాటయి, కులమత భేదములను పాటించుచు రాజకీయ జీవితమును నైతికముగ

చీకాకు పఱచి దేశమునందు అలజడికి, అంతర్యుద్ధములకు దారితీయును. ఇట్టి పరిస్థితులలో సామాన్య ప్రజ తమ విధులను సత్ఫ్రరులుగ నిర్వర్తింప జాలరనుట నిర్వివాదము. బ్రిటిష్ పరిపాలన క్రింద భారతదేశము తుచ్ఛమైన భేదము నాధారము చేసుకొని మత నియోజక వర్గము కలిగియుండెను. స్వాతంత్రి భారతరిపబ్లికు నందు నూతన రాజ్యాంగము ననుసరించి వీనికి తావులేదు.

చరిత్రదృష్ట్యా మనము పరిశీలించినచో కేవలము నగర వాసియగు వాడు మాత్రమే పౌరుడుగా పరిగణింపబడిన నాటి నుండియు, పౌరసత్వ భావము అనేకములగు మార్పులు చెందుచు వచ్చినది. ప్రపంచ చరిత్రలో జరిగిన విప్లవములు కారణముగ పౌరసత్వ భావము విప్లవకరమగు మార్పులకు లోనగుచు వచ్చినది. ప్రతి పౌరుడు తన బాధ్యతలను, విధులను మొదట తన దేశమునందును, కేంద్రీకరించినప్పటికిని, యీ నాడు పౌరసత్వ భావమును రాజకీయ శాస్త్రజ్ఞులు అర్థము చేసికొనురీతి ననుసరించి ప్రతి పౌరుడును, తన కుటుంబము, ట్రేడ్ యూనియన్, మత సంఘము వీటి యెడకూడ కొన్ని బాధ్యతలను కలిగియున్నాడు. వాస్తవమునకు రాజ్యము నెడ అతనికి గల విధులు అన్నిటికిని మిన్న పౌరునికి గల విధులను వివిధ అంతస్తులుగ నియమించు తత్వమును రాజకీయ శాస్త్రజ్ఞులు ప్లూరలిజమ్ అని పిలుతురు. ఈ విషయమునే ధర్మజ్ఞులు చక్కగా చెప్పియున్నారు. "ప్రతి మనుజుడును తన స్వార్థమును తన కుటుంబము కొఱకును, కుటుంబము నెడ తనకుగల విధులను, గ్రామము కొఱకును, గ్రామము నెడ తనకుగల బాధ్యతలను దేశము కొఱకును దేశభక్తిని సహి

తము అంతరాత్మ పారిశుధ్యమునకును బలిదాన మొసర్చ వలయును.” ఇది మత దృష్ట్యా చెప్పబడి నప్పటికిని రాజకీయ శాస్త్రము ననుసరించి కూడ గొప్ప సూత్రము.

ఇట్టి శిక్షణను పౌరునికి గఱపు టెట్లు?:-పౌరునికిసక్రమమగు శిక్షణనొసంగు మొదటిచోటు నిజమునకు గృహమే. గృహమునకు తరువాత పాఠశాల, క్రీడారంగము మున్నగు వానిని పేర్కొనవచ్చును. మానవసేవయే ఆదర్శముగా స్థాపింపబడిన సంఘములు చక్కని క్రమశిక్షణను పౌరుని కొసంగ గలవు. ఇప్పట్టున బాల భటోద్యమము, రెడ్ క్రాస్ సొసైటీ, రామక్రిష్ణా మిషన్ మున్నగువానిని పేర్కొనవచ్చును. పరస్పర సహకారము, స్వయంకృషి, ఆత్మనిగ్రహము, నాయకత్వము, సభ్యత, సంస్కృతి ఇత్యాది పౌరునికి కావలసిన సద్గుణములన్నియు క్రమముగ పై చెప్పబడిన వాటియందును, బడియందును, క్రీడారంగమునను, తక్కుంగల సంఘముల యందును నాయకత్వము ప్రముఖపాత్ర వహించి క్రమశిక్షణను పొందిన పౌరుడు నవీన ప్రజాస్వామిక రాజ్యములలో మానవత్వముతో పాల్గొని దేశసేవచే మానవ కల్యాణము కూర్చగలిగి ప్రపంచాభ్యుదయమే ఆదర్శముగ జీవితమును చక్కని బాటలో నడిపించ గలడు.

---

# ఏడవ ప్రకరణము

## పౌరుని హక్కులు : బాధ్యతలు

సమాజముచే ఆమోదింపబడిన వ్యక్తికిగల స్వతంత్రాధికారమే హక్కు అని నిర్వచింప వచ్చును. ప్రొఫెసరు హాలండు వ్రాసినట్లు "సమాజము నందలి ఇతర పౌరులు హక్కులను పనులను తన శక్తిచే గాక సమాజమొసంగిన సంఘనీతి ప్రాబల్యముచే తన కనుకూలింప చేసుకొనుటయే" హక్కు. కావున పశుబలముపై నాధారపడిన మానవుని శక్తికి హక్కులకును గల తారతమ్యమును బాగుగా గమనింప వలెను. నాగరికత అభివృద్ధిగాంచి, ఉన్నతమును, ఉదాత్తమును, అయిన మానవ సమాజమునందే హక్కులు సాధ్యమగును.

ఇట్లే వ్యక్తి తాను చేయవలసిన విధిగా కాని, చేయకూడనిదిగా కాని సమాజముచే నిర్దేశింపబడిన ధర్మమే బాధ్యత యగును. వాస్తవమునకు హక్కులు బాధ్యతలు ఒక విధముగా పర్యాయ పదములని చెప్ప వచ్చును. ఒక వ్యక్తి అనుభవింపదగిన అనుభవింప వలసిన హక్కుగ కొన్ని అంశములను సమాజము స్పష్టీకరించినచో అట్టి హక్కుకు హానికరములగు పనులను సమాజమునందలి ఇతర పౌరులు చేయరాదనియు సంఘమే శాసించును. ఉదాహరణమునకు సంఘము ఒక వ్యక్తికి నిర్భయముగ తనకుగల భావములను వెలిబుచ్చుటకును ప్రచారము చేయుటకును వాక్స్వాతంత్ర్యమొసంగినచో అట్టి హక్కుకు భంగకర మగునటుల పౌరుని

వాక్స్వాతంత్ర్యము నరికట్టు హక్కులను ఇతర పౌరుల కొసంగదు. అనగా వ్యక్తి తన కొసంగబడిన అధికారమును వినియోగపరచుటకు తన అభిప్రాయములను వెలిబుచ్చుచో కాని, వానిని ప్రచార మొనర్చినకాని, సంఘము నందలి వ్యక్తులు వ్యక్తుల కలయికలగు సంఘములు అతనిని నిర్బంధింపరాదు. ఇట్లే ఆ వ్యక్తియు సమాజమునందు ఇతర వ్యక్తులకు గల అట్టి హక్కులను విరోధింపరాదు.

హక్కులు:-౧. సివిల్, ౨. పొలిటికల్ అని రెండు విధములు. ఇందు సివిల్ హక్కులను పౌరులు పౌరులు కాని వారగు ఇతరులు కూడ అనుభవింప నగును. కాని పొలిటికల్ రాజకీయ హక్కుల పట్ల ఇట్లు కాదు. సర్వసామాన్యముగ, తాత్కాలికముగ ఒక రాజ్యమునందు వసించు ఇతర దేశీయులు రాజకీయ హక్కులనుభవింప అర్హులు కారు. ఇంతే గాక సజ్జనులు అని మనము వర్గీకరించిన మైనర్లు, పిచ్చివాండ్రు, తీవ్రమైన అపరాధములు కారణముగా శిక్ష బడసినవారు కూడ రాజకీయ హక్కులనుభవింప జాలరు.

సివిల్ హక్కులు:-౧. ఆత్మరక్షణ; స్వాతంత్ర్యము - జీవించుటకు హక్కుండినకాని, సమాజములో మరి ఏ ఇతర హక్కును అనుభవించుటకును వీలుండదు. ఈ హక్కుతో పాటు అక్రమముగా ఏ వ్యక్తిని నిర్బంధమునందుంచరాదను హక్కును కూడ ప్రతి పౌరుడు కలిగియుండును. హింసామార్గము నవలంబించు అక్రమ నిర్బంధమునుండి వ్యక్తిని కాపాడు న్యాయచట్టములు ప్రతి దేశమునందును అమలు జరుపబడు చున్నవి. హెబియస్ కార్పసు చట్టము దీనికి ఉదా

హరణము. ౧. ఆంగ్ల దేశమునందలి న్యాయము ననుసరించి అక్రమ నిర్బంధమునకు పరిహార మొసంగబడును. హెబియసు కార్పసు చట్టము ననుసరించి ఏ వ్యక్తియేని అక్రమముగ నిర్బంధము నందుంచబడినచో అట్లు తన్ను అన్యాయమునకు గురిచేసినవారినుండి నష్టపరిహారమును పొందవచ్చును. ఇంతే గాక యీ చట్టము ననుసరించి ప్రభుత్వము ఏ వ్యక్తిని అక్రమముగ చెరయందుంచి అతని స్వాతంత్ర్యమునకు భంగమొనర్పరాదు. వ్యక్తి స్వాతంత్ర్యమునకు అట్లు విఘాతమొనర్చిన ప్రభుత్వ వర్గమును సహితము వ్యక్తులు కోర్టుకు ఎక్కింపగలరు. న్యాయాధికారులు అక్రమ నిర్బంధమందుంచబడిన, అట్లు దరఖాస్తు చేసిన పౌరుని కోర్టు ఎదుట హాజరు చేయవలయునని ఏ కారణములచే నిర్బంధింపబడెనో స్పష్టీకరింపవలసినదని ఆజ్ఞాపింతురు. ఇట్లు ఇంగ్లండు దేశము నందలి న్యాయము ననుసరించి పౌరులకు ఆత్మరక్షణ మొసంగబడుటయే గాక వ్యక్తి స్వాతంత్ర్యముగూడ కాపాడ బడుచున్నది.

ఆస్తిహక్కు:- ప్రతి పౌరుడును స్వార్జితమైనట్టిదియు, పూర్వీకులు ఆర్జించినట్టిదియు ఆస్తిని అనుభవించుటకు హక్కును కలిగి యుండును. ప్రస్తుతము రష్యా, చైనా కమ్యూనిష్టు రాజ్యములయందు ఇందులకు విభిన్నమైన పరిస్థితులు గలవు. మాకియవెల్లీ అను తత్వవేత్త వచించినట్లు ఏ పౌరుడేని తన కుమారుని మరణమును సహితము ఆస్తిని కోల్పోవుట కన్న ముందుగ మఱచిపోగలడు. ప్రభుత్వమునకు చెల్లించ వలసిన పన్నులను చెల్లించుచు తనకుగల ఆస్తిని యథేచ్ఛముగ వారసత్వ చట్టముల యొక్క న్యాయమునకు భంగము రాకుండగ ననుభవించుటకు ప్రతి పౌరునికి హక్కు గలదు. కమ్యూనిష్టు

సిద్ధాంతములకు ప్రజాస్వామ్య సిద్ధాంతములకు ఆస్తి హక్కును గూర్చి కొంత భేదాభిప్రాయము గలదు. మొదట పేర్కొనబడిన యీ కమ్యూనిస్టు సిద్ధాంతములు ఆస్తి హక్కును పూరునికి సంపూర్ణముగ నొసంగవు. అయినను యీ సిద్ధాంతముల ననుసరించి కూడ, ఇళ్ళు, బట్టలు, శ్రామికుల పరికరములు మున్నగు వాని విషయమున ఆస్తి హక్కు అమలు జరుపబడును.

ఆస్తి హక్కునందే ఇమిడియున్న మరియొక హక్కును కూడ మనము గ్రహించవలెను. ఇది ఆర్థిక సంబంధములైన విషయములలో ఒడంబడికలు చేసికొనుటకు వ్యక్తిగల అధికారము. వాస్తవమునకు వ్యక్తులు తమకుగల ఆస్తిని గాని, తమ శ్రమనుకాని, తమకు లాభదాయకమని తోచిన రీతిని అమ్ముటకు అధికారము గలవారు కానిచో ఆస్తి హక్కు వృథా అగును. కాని న్యాయము జరుగవలెననిన చో ఒక ఒడంబడికకు వచ్చు ఇరు పక్షములకు సమానమగు బలము, బేరము చేయగల శక్తి అవసరము. ఇందలి రెండవ ఆర్థిక అంశము అనగా బేరము చేయగలశక్తి చాలా ముఖ్యమైనది. పెట్టుబడిదారీ వర్గమునకును శ్రామికులకును నడుమ మొదటి వర్గము వారికి సంపద కారణముగా నున్న, బలము బేరము చేయగల ఎక్కువ శక్తి పెట్టుబడిదారీ విధానము వర్ధిల్లు సమాజములో శ్రామిక వర్గము వారికి న్యాయము కలుగనీయదని సోషలిస్టు సిద్ధాంతములను నమ్మువారు వాదింతురు. విశాల దృక్పథముగల ప్రభుత్వములును యీ వాదమునందలి సత్యమును గమనించియే మినిమమ్ వేజెస్ ఆక్ట్ – కనీసమగు ఒక మొత్తమునకు తక్కువగా వేతనము లుండరాదు; అను చట్టము ఫ్యాక్టరీ చట్టములు శ్రామికులు పనిచేయు కాలమును,

బిడ్డలు గల తల్లుల పట్ల ఫ్యాక్టరీ యజమానులు యివ్వవలసిన హక్కులు మున్నగువానిని స్పష్టీకరించు చట్టములు అమలు పరచవలసి యున్నది.

భావ స్వాతంత్ర్యము—మరియు, వాక్స్వాతంత్ర్యము:- సంఘ పురోభివృద్ధి వ్యక్తులు తమతమ అభిప్రాయములను నిర్భయముగా వెలిబుచ్చుట యందును అందలి సత్యాసత్య ములను నిష్పాక్షికముగ విమర్శించుటయందును ఆధారపడి యున్నది. విశృంఖలమగు ప్రజాభిప్రాయము బాధ్యతా యుతమైన విమర్శనము సంఘాభివృద్ధికి ఆవశ్యకములు. ప్రజా స్వామిక రాజ్యములయందు అట్టి ప్రజాభిప్రాయము మరియు ముఖ్యమైన పాత్ర నిర్వహించును. నైతిక, సాంఘిక, రాజ కీయ అభ్యుదయమునకు సరియైన విమర్శనచే కట్టుబడినదైన ప్రజాభిప్రాయమే ముఖ్యము. అధికారమునందున్న వర్గము వారు తమ శక్తిని దుర్వినియోగ పరచుటనుండి సంఘమును కాపాడునది యీ ప్రజాభిప్రాయమే. అట్లని ఏ వ్యక్తియేని తనకు తోచిన విషయములను ఇష్టమువచ్చినట్లు పలుకు వాచాలత్వమని దీని అర్థముకాదు. ప్రతి వ్యక్తికిని సంఘము యొక్క 'మంచి'కి భంగము రానంతవరకు తన అభిప్రాయము లను నిర్భయముగా వెలిబుచ్చుటకు, ప్రచారము చేయుటకు అధికారము కలదు. సంఘము నందలి సోదరపౌరుల హక్కుల కని వెలిబుచ్చి ప్రచారమును చేయుటలో హింసాయుతము లైన మార్గము లనుసరించి అలజడిని, విప్లవమును లేవదీయ రాదు. దుష్ప్రచారము దురభిప్రాయములతో సోదర పౌరుల మాన మర్యాదలను భంగమొనర్చుట వాక్స్వాతంత్ర్యమని

పిలువబడదు. ఇట్లు ప్రభుత్వమును రాజ్యమును చట్టవిరుద్ధములు అక్రమములైన అలజడినుండి దుర్మార్గులగు పౌరుల దుష్ప్రచారమునుండి కాపాడుటకును, సంఘమునందు మర్యాదగ బ్రతుకు ఇతర పౌరుల ఖ్యాతిని మలినమొనర్చు బాధ్యతారహితమైన విమర్శనమును శిక్షించుటకును నాగరిక ప్రభుత్వములన్నియు చట్టములను ప్రవేశపెట్టి యున్నవి.

వాక్స్వాతంత్ర్యమునందు సభా, పత్రికా స్వాతంత్ర్యములు ఇమిడియున్నవి. ఆధునిక పరిస్థితులలో పౌరులు తమ అభిప్రాయముల నిర్ణయించుకొనుటకు అనేక సంస్థలను నెలకొల్పు కొనుచున్నారు. రాజద్రోహమునకును, హింసాయుతమైన అలజడి విప్లవములకు దారితీయనంతవరకును యీ సంఘము లన్నింటికి సభాస్వాతంత్ర్య మొసంగబడును. నవీన ప్రజాస్వామిక రాజ్యములయందు ప్రజాభిప్రాయమును కూర్చుట యందును, ప్రజాభిప్రాయమునకొక క్రమమైన రూపము నొసంగుట యందును పత్రికలు ప్రధానమైన పాత్ర వహించును. ప్రజాస్వామికములందు, పత్రిక, రేడియో, సినిమా మున్నగునవి బలీయములైన ప్రచార సాధనములు. రాజకీయ కుట్రలకు దారి తీయనంతవరకు ఇవి తమ అభిప్రాయములను వెలిబుచ్చుటకు స్వాతంత్ర్యమును కలిగియుండును.

మత స్వాతంత్ర్యము:- ఒక వ్యక్తి యొక్క మతము అతనికిని, అతని అంతరాత్మకును, మాత్రమే సంబంధించిన అంశముగా పరిగణింప బడుచున్న యీ రోజులలో మత స్వాతంత్ర్యము ప్రజాస్వామిక రాజ్యములన్నిటి యందును నెల

కొల్ప బడియున్నది. యూదులను బాధించిన జర్మనీ యీ కారణముచేతనే ఫాసిష్టు రాజ్యముగ పరిగణింప బడుచున్నది. ఇతర మతస్థుల మాన మర్యాదలకు భంగము రానీయనంత వరకు ప్రతి వ్యక్తియు మత స్వాతంత్ర్యమును కలిగియుండును.

సంఘములను నెలకొల్పి అందు సభ్యుడుగా నుండుటకు వ్యక్తికిగల స్వాతంత్ర్యము - వాక్, భావ స్వాతంత్ర్యముల యందును మత స్వాతంత్ర్యము లందును ఇమిడియే ఉన్నది. ఆర్థిక, సాంఘిక, రాజకీయ మత నైతిక ప్రాతిపదికలపై నవీన సమాజమున అనేక సంస్థలు పుట్టుచున్నవి. ఉదాహరణము నకు అంతర్జాతీయ శ్రామిక సంఘమువంటి అతి క్లిష్టమైన నిర్మా ణమును కలిగియుండిన ప్రపంచ సంస్థ రోమన్ కేథలిక్కు చర్చి మిషనులను, రామకృష్ణా మిషను సంఘములును కూడా ప్రపంచమంతటను, తమ శాఖలను కలిగియుండి, తమ ఆశ యముల సాధనకై కృషి చేయుచున్నవి. అంతర్జాతీయ శ్రామిక సంఘము ఆర్థిక సంస్థ. తక్కిన రెండును నైతిక మత సూత్రములపై మానవసేవయే ఆశయముగ నిర్మింప బడినవి. ఇట్టి సంఘములయందు సభ్యులుగ నుండుటకును, ఆ సంఘ భావములను కలిగియుండి ప్రచారము చేయుటకు ప్రతి పౌరు నికి స్వేచ్ఛ, హక్కు గలవు.

చట్ట దృష్టిలో సమత్వము:- సమాజములోని ప్రతి పౌరుడును రాజ్యాలలోని ఒక అంగము. ప్రభుత్వము దృష్టిలో ప్రజలందరును సమానులే. కాన, ఒక వ్యక్తికిని, ఇంకొక

వ్యక్తికిని నడుమ తారతమ్యమును కులమును బట్టిగాని, మతము ననుసరించి గాని, పుట్టుక సాంప్రదాయము ననుసరించిగాని, గమనింపరాదు. అమలు జరుపరాదు. కులమత జాతి విచక్షణ పాటించని చట్ట సమత్వము ప్రపంచమంతయు ఆమోదించిన నైతిక సూత్రమే.

కుటుంబ జీవనమునకు సంబంధించిన కొన్ని హక్కులను ఇచ్చట పేర్కొనవగును.

---

# ఎనిమిదవ ప్రకరణము

## ప్రభుత్వము - స్వరూపము - వివిధశాఖలు

సాంఘిక శాస్త్రవేత్తలు రాష్ట్రమును అనేక విధాన ములననుసరించి విభజించి యున్నారు. ఆరిస్ట్రాటిల్ ప్రభుత్వ విధానము ననుసరించి రాష్ట్ర స్వరూపమును ౧. ఏకరాజ్యాధి పత్యము ౨. వర్గప్రభుత్వము ౩. ప్రజారాజ్యము అని మూడు విధములుగ విభజించెను. ఒకే రాజుయొక్క అధికారమునకు లోబడియుండుట ఏక రాజ్యాధిపత్యము. కాని రాజు సక్రమ ముగ పాలించినంత వరకే ఇట్టి రాష్ట్రము ఏక రాజ్యాధి పత్యము అని పిలువబడును. ధర్మాధర్మముల విడిచి రాజు పాలించినప్పుడు రాచరికమును నిరంకుశత్వముగ అరిస్టాటిల్ పరిగణించెను. అనేకులగు ప్రభువుల చేతులలో రాజ్యాధికార మున్నప్పుడు రాష్ట్ర స్వరూపమును "వర్గ పరిపాలన" (aristo cracy) అని యీ గ్రీకు తత్వవేత్త నిర్ణయము. ఏక రాజ్యాధి పత్యము అక్రమమై ననిరంకుశత్వముగ మారినట్లే యీ రెండవ ప్రభుత్వ పద్ధతియు "వర్గ నియంతృత్వము" (ఆలిగార్కి) గా మారును తమ స్వలాభమునకై ఒక ప్రత్యేక వర్గమువారు గాని కులమువారుగాని, రాజ్యాధికారమును దుర్వినియోగ పరచు టయే వర్గనియంతృత్వము అనబడును. ఇట్లే రాజ్యాధికారము ప్రజలచే, ప్రజలకొరకై ప్రజాక్షేమమునకై ప్రజాహస్త గతమైయుండుట ప్రజారాజ్యము లేక (డెమాక్రసీ) అగును. ప్రజారాజ్యము పై చెప్పబడిన రెండు విధములగు రాజ్యాంగ విధానముల వలెనే విరుద్ధ పద్ధతులలో నడిపింపబడుట వలన మాబాక్రసీ లేక మూకరాజ్యముగా మారును. చరిత్రలో

ప్రజలు తమకు సంక్రమించిన అధికారమును ఇట్లు దుర్వినియోగపరచిన సంఘటనలు లేకపోలేదు. ఫ్రెంచి విప్లవ దినములలో పారిసు ప్రజ ఒక రాజకీయ పక్షము తరువాత ఇంకొక రాజకీయ పక్షమును, రాజకీయ నాయకులను వరుసగా గిలెటిన్ అను వధ్యశాలకు పంపించునంతవరకు తుదకు తాము నెపోలియన్ యొక్క నిరంకుశాధిపత్యము క్రిందకు వచ్చువనుక ఫ్రెంచి విప్లవ చరిత్రలో వర్ధిల్లిన ౨౬ సంవత్సరముల కాలము క్రీస్తు శకము ౧౭౮౯ నుండి ౧౮౧౫ వరకు సూబాక్రిసీకి తార్కాణము.

ప్రభుత్వశాఖలు:- ప్రభుత్వమును ౧. కార్యనిర్వాహక వర్గము ౨. శాసనసభ ౩. న్యాయపరిపాలనశాఖ అని మూడు విధములుగ విభజింప వచ్చును.

శాసనసభ :- ప్రజాస్వామిక రాజ్యములందు నిర్ణీత నియోజకవర్గములనుండి ప్రజలచే ఎన్నుకొనబడిన సభ్యులు చట్టనిర్మాణము గావించుటకు సమావేశమైన సభనే శాసనసభ అని అందుము.

శాసనసభ ముఖ్యధర్మములు రెండు. ౧. ప్రభుత్వవిధానమును చర్చించుట. ౨. చట్ట నిర్మాణము. ప్రభుత్వము యొక్క ఆర్థిక రాజకీయ సాంఘికాది ప్రణాళికలను చర్చించి ప్రభుత్వవిధానమునకు ప్రజలందరును ఆమోదించు స్వరూపము నొసంగుటయే శాసనసభ యొక్క ముఖ్యోద్దేశము. ప్రజాభిప్రాయము ననుసరించి శాసనసభ యందలి అధిక సంఖ్యాకులగు సభ్యుల ఆమోదము గడచిన చట్టముల నిర్మాం

చుట శాసనసభ యొక్క రెండవ ముఖ్య ధర్మము. ఇంతేగాక మరికొన్ని ఇతర ధర్మములను శాసనసభ నిర్వర్తించుచుండ వచ్చును. ఫ్రెంచి రాజ్యాంగము ననుసరించి ఫ్రెంచి శాసన సభ ఫ్రెంచి అధ్యక్షుని, ఉపాధ్యక్షుని కూడ ఎన్నుకొనును. ఇంగ్లండు దేశమున హౌస్ ఆఫ్ లార్డ్స్ లేక ప్రభువుల సభ అని పిలువబడు శాసనసభయొక్క రెండవ భాగము ఇంగ్లాండు యొక్క కట్టకడపటి న్యాయస్థానము. కొన్ని దేశములలో శాసనసభయందు రెండు సభలుండును. దానిని బైకెమరల్ విధానమందురు.

చట్ట నిర్మాణ విధానము అన్ని దేశములందును ఇంచు మించు ఒకే విధముగ నుండును. ౧. శాసనసభయొక్క ఏ సభ యందైనను బిల్లులే (శాసనములుగా వెలువడుటకు పూర్వము శాసనసభలో చర్చనీయాంశములైన ముసాయి దాలను బిల్లులు అని అందురు.) ప్రవేశపెట్టబడ వచ్చును, ౨. చట్టముగ నిర్మింపబడుటకు శాసనసభయందలి రెండు సభల ఆమోదము అవసరము. ఆర్థికముసాయిదా చట్టములపట్ల యీ విధానము వర్తించదు. ౩. శాసనసభ సమావేశమునకు చర్చనీయాంశమైన ముసాయిదా చట్టమును గూర్చి చర్చ జరుగునప్పుడు "కోరమ్" కనిష్ఠ సంఖ్య – అనగా కొంతమంది కనీసపు సభ్యుల హాజరు అవసరము. హాజరైన సభ్యులసంఖ్య మొత్తము సభ్యుల సంఖ్యలో నిర్ణీత సంఖ్యకు తక్కువగాక యున్ననే సభాకార్యక్రమము జరుపనగును. ౪. శాసన సభ యందలి అధికసంఖ్యాకులగు సభ్యుల ఆమోదము మెజా రిటీ అభిప్రాయము బడసి ముసాయిదా చట్టము శాసనముగ చెల్లుబడి అగును.

చర్చనీయాంశములైన యీ ముసాయిదా చట్టములలో అనేకములైన మార్పులు ప్రవేశపెట్టవచ్చును. ముసాయిదాలను చర్చించుటకు వీలుగా శాసనసభ కొన్ని కమిటీలుగా విభజింపబడును. బిల్లులను ౧. ప్రైవేటు సభ్యుల బిల్లులు ౨. ప్రభుత్వ పక్షమువారివి, ౩. ఆర్థిక బిల్లులు అని మూడు విధములుగ విభజింపనగును.

చట్ట నిర్మాణము తరువాత ప్రభుత్వ విధానమును చర్చించుటయే శాసనసభయొక్క రెండవ ముఖ్యమైన విధి. ఇది అనేక విధములుగ సాధ్యమగును.

౧. శాసన సభా కార్యక్రమము నందు ప్రశ్నోత్తరముల కాలము చాలాముఖ్యమైనది. ప్రభుత్వ పక్షమునందలి మంత్రులను ప్రశ్నలడుగుటవలన శాసనసభకు అత్యావసరమగు సమాచారము వారి జవాబులవలన లభించుటయేగాక ప్రభుత్వ విధానము చక్కని విమర్శనమునకు గురి అగును.

శాసనసభ యందు తీర్మానము ఏదేని ప్రవేశపెట్టి ప్రభుత్వ పక్షమువారి దృష్టిని దేశ క్షేమమునకును, ప్రజకు ముఖ్యమైన ఒక విషయము పైకి మరల్పవీలగును.

ప్రభుత్వముపై ప్రవేశపెట్టబడిన విశ్వాసరాహిత్య తీర్మానము నెగ్గినయెడల పభుత్వ పక్షమువారు మంత్రి వర్గ స్థానములనుండి విరమింపవలసిన అవసర మేర్పడును. వాస్తవమునకు ప్రభుత్వ పక్షమునకు శాసనసభయందు మెజారిటీ లేకున్నప్పుడే ఇది సాధ్యము.

'అడ్జర్న్ మెంటు మోషన్' లేక కార్యక్రమమును వాయిదా వేయించు విధానమునవలంబించుట వలనను దేశము నందలి ఒక ముఖ్యమైన సమస్యపై ప్రభుత్వదృష్టిని మరల్ప వచ్చును.

బడ్జెటు విధానము అనగా ప్రభుత్వము వారి ఆర్థిక ప్రణాళికను విమర్శించినప్పుడు పేరునకు మాత్రము బడ్జెటు అంచనాలో కొంత మొత్తము తగ్గించుట చర్చనీయాంశముగ శాసనసభా కార్యక్రమ మారంభించి ప్రభుత్వవిధానము నంతటిని ఒక్కుమ్మడిగా విమర్శింప వీలగును.

శాసన నిర్మాణము ప్రభుత్వ విధానమును విమర్శించుట అని పైన పేర్కొనబడిన రెండు ధర్మములను నిర్వర్తించుటయే గాక శాసనసభ మరియొక ముఖ్య ధర్మమును కూడ కలిగియున్నది. ప్రభుత్వము నడచుటకు అత్యవసరమైన ధనమును మంజూరు చేయునదికూడ శాసనసభయే. ఈ అధికారము శాసనసభ హస్తగతమై యుండునని చెప్పవచ్చును.

కార్యనిర్వాహక వర్గము:- శాసనసభ తరువాత మనము పరిశీలించవలసినది కార్యనిర్వాహక శాఖ. మంత్రివర్గమే కార్యనిర్వాహకవర్గము. కాని, మంత్రులతోపాటు ప్రభుత్వోద్యోగులు,కడకు గ్రామపంచాయితీ అధికారులు కూడ కార్యనిర్వాహకవర్గముగ మనము పరిగణింపవలయును. మంత్రులను తాత్కాలిక కార్యనిర్వాహక వర్గమని, ప్రభుత్వాధికారులను శాశ్వత కార్య నిర్వాహకవర్గమని వర్గీకరించుట కొంతమంది రాజకీయ శాస్త్రజ్ఞుల ఆచారము. ౧. ఎన్నిక ౨. నియోజనము. 3. ఉద్యోగము అను మూడు విధములుగ కార్యనిర్వాహకవర్గము

నిర్మింపబడవచ్చును. ఇంగ్లండు దేశపు ముఖ్యమంత్రి, అమెరికా దేశపు అధ్యక్షుడు ఎన్నుకొనబడు కార్యనిర్వాహకవర్గ విధానమునకు చెందినవారు. కాని, యీ ఎన్నికలలో స్వల్పమగు భేదము గలదు. ఇంగ్లండు దేశపు ముఖ్యమంత్రి ప్రజలచే ఎన్నుకొనబడిన శాసనసభ్యులలో అధికసంఖ్యాకులుగల రాజకీయ పక్షనాయకుడు. అమెరికా దేశపు అధ్యక్షుడు అట్లుగాక అమెరికా దేశమునందలి వివిధ రాష్ట్రముల పౌరులు ఎన్నుకొనిన సభ్యులచే నెన్నుకొనబడినవ్యక్తి. భారత దేశపు నూతన రాజ్యాంగ విధానము ననుసరించి ముఖ్యమంత్రి, అధ్యక్షుని ఎన్నికలలో యీ రెండు పద్ధతుల కలయికయు కానగును.

న్యాయశాఖ:- చట్టములను అమలు జరుపుటలో ప్రభుత్వము వ్యక్తిని అన్యాయము చేయకుండు నట్లును వ్యక్తి ప్రభుత్వ చట్టముల నుల్లంఘించిన అతనిని శిక్షించుటకును, పౌరులొకరి హక్కుల నొకరు ఉల్లంఘింపకుండ చూచుటకును, న్యాయశాఖ యున్నది. వైకౌంట్ బ్రైస్ వంటి అనేకమంది పాశ్చాత్య రచయితలు అనేకులు సమర్థమైన న్యాయశాఖ దేశాభ్యుదయమునకు అత్యావశ్యకమని నుడివియుండిరి.

ఈ న్యాయశాఖకు ప్రధాన కేంద్రము ఢిల్లీలోగల సుప్రీము కోర్టు. ప్రస్తుత రాజ్యాంగ చట్టమునకు పూర్వము దీనినే ఫెడరల్ కోర్టుఅను పేర వ్యవహరించుచుండిరి. అప్పుడు భారత న్యాయస్థానము తీర్పులపై లండన్‌లో ప్రీవీ కౌన్సిలు సభ విచారించు అధికారము కలిగియుండెను. కాని నేడు సుప్రీమ్ కోర్టు యిండియా అంతకును ప్రధాన న్యాయస్థానము. అచటనొక ప్రధాన న్యాయమూర్తియు, ఏడుగురికి మించ

కుండ న్యాయమూర్తులును ఉందురు. ఇది రాజ్యాంగ చట్ట మునకు రక్షణకర్తయే గాదు, భాష్యకర్తకూడ. అదిగాక హైకోర్టులనుండి అప్పీళ్లు వినును. రాష్ట్రములలో హైకోర్టు లున్నవి. ఇందుగూడ ప్రధాన న్యాయమూర్తియు సాధారణ న్యాయమూర్తులును ఉందురు. వీరి సంఖ్య వేరువేరు రాష్ట్రములలో వేర్వేరుగా ఉండును. ఇందు కొందరిని న్యాయవాదుల నుండియు, కొందరిని రాష్ట్ర న్యాయ శాఖోద్యోగులనుండియు తీసికొందురు. హైకోర్టుక్రింద ప్రతి జిల్లాలో జిల్లా మరియు సెషన్సు జడ్జీ అను అధికారి యుండును. మన రాజ్యాంగ చట్టము వీరి ఉద్యోగ అర్హతలను కూడ నిర్ణయించినది. వీరందరకును సివిలు క్రిమినల్ అధి కారములుండును. సివిలు అనగాఆస్తి హక్కులు సంబంధమగు వ్యాజ్యములు. క్రిమినలు శాఖ అనగా నేర విచారణ సంబం ధమైనది. వీరి క్రింద సివిలు తగాయిదాలు విచారించుటకు మునసబులు, క్రిమినలు నేరములు విచారించుటకు మేజిస్ట్రే టులు గలరు.

న్యాయశాఖ సక్రమముగా పని చేయుటలో ఆవశ్యక ములు కొన్నిగలవు. అందు మొదటిది యిటు ప్రభుత్వమునకు అటు ప్రజలకు వారు అతీతులు కావలయును. నిర్భయముగా ప్రభుత్వము నిర్ణయమునకు కూడ వ్యతిరేకముగా తీర్పు నిచ్చు సాహసము వారి కుండవలయును. ఈ విషయమున మన దేశ న్యాయస్థానములకు గొప్ప ప్రఖ్యాతిగలదు. దీనినే న్యాయ శాఖ స్వాతంత్ర్యము అందురు.

రెండవది, న్యాయ కార్యనిర్వాహక శాఖలు ఒకే చేతులలో నుండరాదు. అట్లుండినచో నేర ప్రతిపాదకుడును

నిర్ణయాధికారులును ఒకరై ప్రజలహక్కులకు భంగము కలుగును. ఈ రెంటిని వేరుచేయవలెనని మన రాజ్యాంగ చట్టమాదేశించినది.

నేటి మన న్యాయ పరిపాలనా విధానమున అనధికార ప్రముఖులకు గూడ నియమిత అధికారములున్నవి.

(a) గ్రామాధికారులకు, పంచాయితీలకు ఒక పరిమితి దాటని నేరముల విచారించుటకు అధికారము లున్నవి. చెన్నరాష్ట్రమునందు క్రొత్త పంచాయితీ చట్టము ననుసరించి అట్టి అధికారములు ఏర్పాటు చేయబడినవి.

(b) పట్టణములలో గౌరవ మేజిస్ట్రేటులు అనువారు చిన్న నేరములను విచారించు చుందురు.

(c) అట్లే, కొన్ని రాష్ట్రముల ముఖ్య పట్టణములలో నేరముల విచారణ షెరీఫ్ అను అధికారి యాజమాన్యమున జరుగును.

(d) మరియు, జడ్జీలకు నేర విచారణలో సలహా నిచ్చుటకు కొందరిని న్యాయపరిపాలనకు సంబంధించని అనధికారులను అసెసర్లుగను, జ్యూరీలుగను నియమింతురు.

---

# తొమ్మిదవ ప్రకరణము

## ప్రజాస్వామికము లేక ప్రజాస్వామ్య విధానము

ప్రజాస్వామికము లేక ప్రజాస్వామ్య విధానమును ఒక తెగకు చెందిన రాజ్యముగగాని, ఒక విధమగు ప్రభుత్వ పద్ధతిగ గాని పేర్కొన వచ్చును. ప్రత్యేక ప్రభుత్వపద్ధతిగ రాజకీయ శాస్త్రజ్ఞులు విభిన్న నిర్వచనముల నొసంగి యుండిరి. గ్రీకు తత్వవేత్తలు నిర్ణయించిన ప్రకారము ప్రజాస్వామికము అనేకుల పరిపాలన. వీరి ఉద్దేశము ప్రకారము జాతిలో ఎక్కువ భాగమునకు చెందిన ప్రజానీకము ప్రభుత్వమునందు పాల్గొనినచో అది ప్రజాస్వామికమే అగును. బ్రాయిూ అను రచయిత వ్రాసినట్లు, ఒక దేశముయొక్క జాతిలోకాని, సమాజములోకాని, గల ప్రజలయందు అధిక సంఖ్యాక వర్గమువారు సార్వభౌమాధికారమును కలిగి యున్నచో అట్టి ప్రభుత్వ విధానమును ప్రజాస్వామికమని పిలువవచ్చును. ప్రజలచేత, ప్రజలకొరకు, ప్రజలవలన నిర్వహింపబడు ప్రభుత్వము ప్రజాస్వామికమని పిలువ వచ్చును. ప్రజలచేత, ప్రజలకొఱకై, ప్రజలవలన నిర్వహింపబడు ప్రభుత్వము ప్రజాస్వామికమని అబ్రిహాములింకన్ నిర్వచించెను. లార్డుబ్రైసు వ్రాసినట్లు ప్రభుత్వము ఒక ప్రత్యేక వర్గము యొక్క గాని, వర్గములయొక్కగాని హస్తగతమై యుండక సామాన్యముగ సమాజమున కంతటికిని చెందియుండుటయే ప్రజాస్వామ్యమని స్పష్టీకరించెను. అధిక సంఖ్యావర్గము ఒక ప్రత్యేక వర్గము కానప్పుడే ఆదర్శమగు ప్రజాస్వామికము సాధ్యమగును. ఎన్నికలు నియోజక వర్గములపై ఆధారపడి

ప్రజాస్వామిక ప్రభుత్వము నడిపింప బడుచుండును. కాని, ఉన్నతము ఉదాత్తము అయిన నైతికదృక్పథముతో ఎన్నికలు జరుగు సమాజములో ప్రజాస్వామికము వర్ధిల్లుచున్నది అని చెప్పకొన వీలగును.

ప్రస్తుత ప్రజాస్వామిక రాజ్యాంగములన్నియు ప్రజా ప్రాతినిధ్యముపై ఆధారపడి ప్రజలందరును ఒక్కుమ్మడిగ ప్రభుత్వమునందు పాల్గొనుటకు వీలుకలిగించును. పౌర రాజ్యాంగము వర్ధిల్లిన ఆ రోజులలో నగరమునందలి ప్రజా నీకమంతయు, ఒకే శాసనసభయందు సమావేశమై చట్టనిర్మా ణము గావించుటకును కార్యనిర్వాహకవర్గము నెన్నుకొని ప్రభుత్వముయొక్క పథకాలను అమలు జరుపుటకును, న్యాయమును నిర్వహించుటకును వీలుండును. కాని, దేశములు ఉపఖండములు వంటి పెద్ద భూభాగములోని ప్రజానీకమున కంతటికిని సంబంధించిన ప్రభుత్వము సాధ్యము కావలె నన్నచో ప్రాతినిధ్యము అవసరము.

ప్రజాస్వామిక ప్రభుత్వ విధానమునందలి బాగోగులను ప్లేటో కాలమునుండి లాస్కీనాటి వరకు సాంఘిక తత్వవేత్త లందరు తర్జనభర్జన చేసియే ఉండిరి. అందు ముఖ్యమైన వాటిని మనము ఇచ్చట పేర్కొనవగును.

ప్రజాస్వామిక విధానమునందలి సుగుణములు:-

౧. ప్రభుత్వాధికారమును హస్తగతము చేసికొనిన వారిపై

ధికముగ ప్రజానీకముయొక్క అభిమతముల ప్రభావము సాధ్యమగునటుల చేయునది ప్రజాస్వామిక విధానము మాత్రమే. కావున తక్కిన ప్రభుత్వ విధానము కంటే ప్రజాస్వామికము ఒక ఉన్నతమైన స్థాయికి చెందియున్నది. ౨. ప్రజామోదము బడసిన ప్రతినిధుల పరిపాలన, ప్రజారంజకమగు ఎన్నికలు, బాధ్యతాయుతము బలీయము అయిన ప్రభుత్వము నెలకొల్పబడుటకు తోడ్పడును. 3సాధారణ ప్రజానీకము వివేకవంతులుగను, విజ్ఞానులుగను ఉండి తమ శక్తిసామర్థ్యములను తెలివితేటలను ఇనుమడింప చేసికొనుటకు, దేశభక్తిపూరితులు, త్యాగధనులు అగుటకు ప్రజాస్వామికము సహాయకారి. ప్రజలు ప్రభుత్వము నడపింపబడు విధానమును వారికి అందజేయును. ౪. సక్రమ, సంపూర్ణ పౌరశిక్షణకు ప్రజాస్వామిక ప్రభుత్వవిధానము చక్కని క్రీడారంగము. ౫. ప్రజల హక్కులు, అధికారములు ప్రజాస్వామిక విధానమునందు కాపాడబడినట్లు ఇతర ప్రభుత్వ విధానమునందు సాధ్యము కాదు. ౬. స్వేచ్ఛాసమత్వము అను సూత్రములపై నిర్మింపబడిన దగుటవలన ప్రజాస్వామిక విధానము ప్రజలయందు ఒక తృప్తిని కలుగజేసి విప్లవము, అలజడి కలుగుటకు గల పరిస్థితుల ప్రాబల్యమును సన్నగిలజేయును.

వాస్తవమునకు ప్రజాస్వామిక విధానమునందు కష్టారిష్టములకు తావులేక పోలేదు. ౧. ఒక దేశమునందలి మెజా

రిటీ వర్గమువారి అభిప్రాయము ఎట్టిదైనను చట్టమగును. మైనారిటీ వర్గముయొక్క భావములు, ఉన్నతములును, దేశా భ్యుదయమును కలుగచేయునవియు అయినప్పటికి మెజారిటీ వర్గమువారి అభిప్రాయము చెల్లుబడి యగును. ఇట్లు ప్రజా స్వామికము ఒకే అంతస్థులో నుంచుచున్నది. ౩. సక్రమము, చక్కనిది, బలీయమైనది అయిన పరిపాలన సత్ప్రభుత్వము వీలగుటకు అవసరమగు ప్రత్యేక విషయములందలి జ్ఞానము. అట్టి జ్ఞానము బడయుటకు కావలసిన చదువు మున్నగు విష యముల ప్రాధాన్యతను ప్రజాస్వామికము ఏమాత్రమును గమనించుటలేదు. ౪. సహజముగ నాయకులై ప్రజను నడి పింపగలవారిని గుర్తింపజాలక అలజడిని కలుగజేయువారు, విపవములను లేవనెత్తువారు వాగాడంబరులు అయినవారికి సమాజమున ప్రముఖస్థానము లభించు వీళ్లను ప్రజాస్వామి కము కలుగజేయుచున్నది. ౫. దుర్వ్యయమునకు, అనవసరపు ఖర్చులకు ప్రజాస్వామికమునందలి ఎన్నికలు దారితీయుచున్నవి. ౬. సమాజమును ఒక ఉన్నతమైన అంతస్తుకు తీసికొనిపోవు టకు బదులు ప్రజాస్వామికము ప్రజను క్రిందమెట్టుకే దిగ లాగుచున్నది. ౭. విద్య, విజ్ఞానము, సైన్సు, కళ అభివృద్ధి చెందుటకు సూటిగా వ్యతిరేకించనప్పటికి ప్రజాస్వామికము వీటికి ప్రత్యేక ప్రోత్సాహమీయలేక పోవుచున్నది.

సాంఘిక తత్వవేత్త సర్. హెన్రీమైన్ చరిత్రకారుడు ట్రిస్టీ, వేదాంతి హెచ్. జి. వేల్స్ మున్నగు ప్రముఖు లనేకులు ప్రజాస్వామిక విధానమ నుతీవ్రముగ విమర్శించియున్నారు. బార్కరు వ్రాసినట్లు "చివరకు ప్రజాస్వామికము ఎన్నికలను ఎట్లో తమ కనుకూలము చేసుకోగల కొద్దిమంది వ్యక్తులకు

మాత్రము స్వాధీనమైన రాజ్యమగుచున్నది. ముఖ్యముగా ప్రజాస్వామ్యమునందలి ఎన్నికలుదుర్వ్యయమునకు ఎట్లు దారి తీయుచున్నదీ ప్రొఫెసరు గార్నెరు స్పష్టీకరించెను. ప్రజాస్వామికము డబ్బుగల కొద్దిమంది ధనవంతుల హస్తగతమగుటకు గల మార్గములు అనేకములు. ఎన్నికల యందలి అవినీతి కారణముగా ప్రజాస్వామికము ధనవంతుల నిరంకుశ రాజ్యమగుచున్నది.

లార్డుబ్రైస్ ప్రజాస్వామిక ప్రభుత్వ విధానమునందలి నష్టములను యీ క్రింది విధమున వివరించెను. ౧. ప్రభుత్వ విధానము, పరిపాలన చట్టనిర్మాణము ధనవంతుల అధీనమగుటచే వికృతము చేయబడుట. ౨. రాజకీయములను కూడ ఒక వృత్తిగా మార్చుట. ౩. పరిపాలనలోని దుర్వ్యయము. ౪. సమత్వము అను సూత్రమునకు ప్రజాస్వామికమని చేయు తప్పుడు వ్యాఖ్యానము. ౫. పరిపాలనా చాతుర్యము అందుకు వలసిన ప్రత్యేక సామర్థ్యము గుర్తింపలేకపోవుట. ౬. రాజకీయ కక్షుల అవసర ప్రాబల్యము. ౭. కొన్ని చట్టములు ప్రత్యేకమైన కొన్ని సంస్కరణములు చేసెదమని హామీయిచ్చి ప్రజలనుండి యీ రాజకీయ నాయకులు ఓట్లు కొను విధానము. వాస్తవమునకు లార్డుబ్రైస్ స్పష్టీకరించినట్లు పైన పేర్కొనబడిన కష్టనిష్ఠూరములు, ప్రజాస్వామికము నందేగాక ఇతర ప్రభుత్వ విధానములందును కానవగును. కాని ప్రజాస్వామికము ప్రత్యేకముగా ౧. ప్రభుత్వ యంత్రమును నడుపు కొద్దిమంది స్వార్థపరత్వము. ౨. పత్రికలద్వారా స్వార్థపరులగు రాజకీయ నాయకులువ్యాపింపజేయు అబద్ధములు, తప్పుడు ప్రచారము అను రెండు అనర్థములకు ఆకరమగుచున్నది.

ప్రజాస్వామికము నందలి బాగోగులను నిష్పాక్షిక ముగా పరిశీలించిన, లార్డుబ్రైస్, నిరాధారముగా కొద్దిమంది విమర్శకులు ప్రజాస్వామికమునువిమర్శించిన రీతిని ఖండించెను. ప్రజాస్వామిక ప్రభుత్వ విధానము – విజ్ఞానము సైన్సు కళ అభ్యుదయ మార్గముల అభివృద్ధి చెందుటకు తోడ్పడ జాల దనియు, స్వతంత్రపౌరుని వ్యక్తిత్వమును నిర్మూలించుననియు, ఒక ఉన్నతమైన అంతస్తుకు తీసికొని పోవుటకు బదులుగా ప్రజను క్రింది మెట్టుకే దిగలాగు యీ ప్రజాస్వామికమును గూర్చి వారు చేసిన ఆరోపణలను పూర్తిగా ఖండించెను.

ఈ అధ్యాయమును ముగించుటకు ముందు ప్రజాస్వామి కము విజయవంతము కావలెనన్న అత్యావసర పరిస్థితు లేవో పరిశీలింతము. ౧. చక్కటి రాజ్యాంగము:— ప్రభుత్వ వ్యతిరేక పక్షమువారు తమ కిష్టముకాని ప్రభుత్వ పద్ధతుల పైనను ప్రణాళికల పైనను ఆరోపణలు, గావించినప్పటికి వారి ఆరోపణలు, రాజ్యాంగము యొక్క ముఖ్య సూత్రము లకు హాని కలిగించునవి గాకుండినచో ప్రజాస్వామికము విజయవంత మగుటకు అది అత్యంతసహకారి. "చక్కటి రాజ్యాంగము కలిగినయెడల ప్రజాస్వామికము నడిపింపబడు విధానము, అలజడిలేని కొలను నందలి నీరమువలె నిశ్చలము గను, నిర్మలముగను నుండును" అని లేకీ అనురాజ్యాంగ శాస్త్రజ్ఞుడు వ్యాఖ్యానించెను.

ప్రజానురంజకమగు పరిపాలనము:–ప్రజా స్వామిక ప్రభుత్వమును నడిపించు రాజ్యాంగ వేత్తలు రాజకీయ ఉపజ్ఞ, పరిపాలననాచతురత్వము గలవారుగను పౌరసత్వ

ధర్మములను గ్రహించి ఆదరించు వారుగను, ప్రజామోదము బడయగల ప్రణాళికలను నిర్మించు సామర్థ్యము గలవారుగ నున్నచో ప్రజలలో అధిక సంఖ్యాకులు వారి నిశ్చయమును అమలుపరచుటకు సంసిద్ధులుగ నుందురు. అల్ప సంఖ్యాక వర్గమువారి స్వతంత్ర ప్రత్యేక భావముల గౌరవింపగలవారు గను నుండుట ప్రజాస్వామికము విజయవంత మగుటకు దోహదమిచ్చును.

ప్రజలయొక్క ఆర్థిక, నైతిక, అభ్యుదయము:- ప్రజాస్వామికము నడిపించు పెద్దలకు రాజకీయ ఉపజ్ఞ అవసరమైనట్లే ప్రజాస్వామికము నిరవధిగా కొనసాగుటకు ప్రజలు విద్య, విజ్ఞానము కలవారుగను, ఉన్నతమైన పౌరసత్వ ధర్మములచే ఉత్తేజింపబడిన వారుగను దేశక్షేమమునకు పాటు బడువారుగను ఉండవలెను. అంతియగాక ప్రజలయందు రాజకీయ చైతన్యమును అవసరము. వారు దేశము యొక్క ఆర్థిక రాజకీయ సమస్యలను అవగాహన చేసికొనుటయందు వాటిని అమలు పరచు విధానములను గ్రహించుటయందు ప్రముఖపాత్ర నిర్వహించిననాడే ప్రజాస్వామికము కొనసాగును. గ్రీసు దేశములోని ఏథెన్సులో ప్రజాస్వామికము జయవంతమగుటకు ముఖ్యకారణముగా పెరిక్లీసు అను గ్రీకు నాయకుడు ఏథెన్సు పౌరులు వారి ధర్మములు విషయమై ఏ నాడును ఏమరియుండరనియు రాజ్యాంగ సమస్యలకు దూరముగా వేదాంతులవలె నివసించుట వారు నుగుణముగా భావించరనియును అందులకు మారుగా ప్రభుత్వ విషయములలో ప్రతి పౌరుడును తన ధర్మమేదో గ్రహించుచు ప్రభుత్వ

విధానమునందు అవసరమగు జోక్యమును కలిగించుకొ
ననియు వివరించెను.

ఇంతేగాక రాజ్యాంగ విధానము ప్రజల అభిరుచికి అను కూలమైనదిగా నుండవలెను. చరిత్ర పారంపర్యముగా ప్రజకు సంక్రమించుచున్న సంస్కృతి, నాగరికత — ప్రజాస్వామిక విధానమును నడపగల చతురతను ఉపజ్ఞను ప్రజకు అందియ వలసినదేగాని, అట్లు సంసిద్ధత కాని ప్రజపై ప్రజాస్వామి కమును పైనుండి "రుద్దినచో" ప్రజాస్వామికము విజయ వంతము కాజాలదు.

భావ స్వాతంత్ర్యము :- ఇంతకును పౌరులవ్యక్తి స్వాతంత్ర్యము సంపూర్ణముగా నిర్మింపబడుటకు అవసరమైన పత్రికలు, రేడియోలు మున్నగు ప్రచార సాధనములు సభా స్వాతంత్ర్యము వృద్ధి పొందని సమాజములో ప్రజాస్వామికము విజయవంతము కానేరదు.

ప్రజాస్వామిక ప్రభుత్వ విధానమునందలి బాగోగులు కష్టనిష్ఠూరములు ఎట్లున్నను ప్రపంచమందలి నాగరిక జాతు లన్నియు ఆదర్శమైన ప్రభుత్వ విధానముగ ఆమోదించి గమ్యస్థానముగా నిర్ణయించుకొనిన ప్రభుత్వ విధానము ప్రజా స్వామికమే. ప్రజాస్వామిక మార్గమున కొన్ని నష్టములు లేకపోలేదు. కాని బ్రైసు స్పష్టీకరించినట్లు ప్రజాస్వామికమును విమర్శించిన వారెవ్వరును ఇంతకు మించిన ఉత్తమమైన ప్రభుత్వ విధానమును చూపలేకపోయిరి.

---

# పదవ ప్రకరణము

## రాజకీయ పక్షములు

ప్రజాస్వామ్య విధానము జయప్రదమగుటకు ప్రజల యొక్క రాజకీయ జీవితము సక్రమముగా నిర్మింపబడి యుండ వలెను. రాజకీయపక్షములు సరియైన మార్గములయందు నడచుచున్నప్పుడే ఇది సాధ్యమగును. రాజకీయ పక్షము లనగా ఒకే విధమైన రాజకీయ దృక్పథము కలిగి ప్రత్యేక రాజకీయ సిద్ధాంతములయెడ తమ అభిలాషను వ్యక్తపఱచుచు దేశాభ్యుదయము, శాంతి భద్రతల విషయమై ఒకే విధమైన పథకములు, ఆర్థిక, సాంఘిక సమస్యల యెడ ఒకే ప్రణాళికలు కలిగియుండు ప్రజాసముదాయములు.

రాజకీయ రంగములో ఇట్టి కక్షలు అనేక కారణము లచే ఉద్భవింపవచ్చును. నిరంకుశ ప్రభువుల పరిపాలనా ఫలితముగా, తమంతతామే స్వతంత్ర రాజకీయ సిద్ధాంతి ములు కలిగిన మేధావులు, నిర్మాణకార్యక్రమము కలిగిన సమర్థులు. అట్టి నాయకుల సలహాలను మన్నించు ప్రజలు, ఒక రాజకీయ పక్షముగ నేర్పడవచ్చును. వాస్తవమునకు ఒక దేశమునందలి ప్రజలు ఉమ్మడిగా రాజకీయ జీవితము నందు సంచలనము కలిగించిన పట్టుననే ప్రజాస్వామ్య విధా నము వంటి ప్రభుత్వము అమలు జరుగ వీలుకల్గును. అట్లు ప్రజాస్వామ్యము ఆచరణ రూపమునకు వచ్చినపిదప, దీనికి కారణభూతములగు రాజకీయ పక్షములు శాశ్వతముగా ప్రజలయొక్క రాజకీయ జీవితమున నిల్చిపోవుటయు తట స్థించెను.

ప్రొఫెసరు గెట్టిలు అను నతడు నిర్వచించినట్లు "ఓటింగు హక్కు కారణముగా ప్రభుత్వ విధానముపై ప్రాబల్యము కలిగియుండు పథకములను ప్రణాళికలను ప్రభుత్వము ద్వారా అమలు జరపగలుగు శక్తిని సంపాదించు పౌరుల యొక్క సమూహామే" ఒక రాజకీయ పక్షమగును. రాజ్యాంగము యొక్క న్యాయశాస్త్రము రాజకీయ పక్షములను 'వస్తుతహా' అంగీకరింపనప్పటికీ ప్రజాస్వామ్య విధానము యొక్క రాజకీయ జీవితములో రాజకీయ పక్షములు తప్పని సరియైన అంగముగా నిలచిపోయినవి. నిజమునకు ప్రజాస్వామ్యము యొక్క పరిణామమునందు రాజకీయ పక్షముల యొక్క ఉద్భవము, క్రమనిర్మాణము, ప్రాబల్యము చెప్పకోదగిన అంశములైనవి.

చరిత్ర ప్రసిద్ధమైన కొన్ని రాజకీయ పక్షములు ప్రజా జీవితమున ఒక ముఖ్యభాగమై కొంతవరకు నిలచిపోవు చుండగా, దేశమును ఏ దేని ముఖ్యసమస్య, ఆర్థికముగాగాని, సాంఘికముగాగాని, రాజకీయముగాగాని, ఎదుర్కొనినప్పుడు క్రొత్త రాజకీయ పక్షములు పుట్టుటయు సంభవించును. ప్రభుత్వ విధానము ఎడ ప్రజలలో భేదాభిప్రాయము జనించుటయు, ఆ కారణముగా వేరు నిర్మాణకార్యక్రమము ప్రణాళికలు గల వేరు రాజకీయ కక్షలు ప్రజాజీవితమును ప్రవేశించుటయు సంభవము.

కులమత కక్షలు కారణముగా రాజకీయకక్షలు బయలు దేరుటయు, అరుదైన విషయము కాదు. భారత దేశ రాజకీయ జీవితమున నిర్మింపబడిన ముస్లింలీగు, హిందూ

మహాసభలు ద్రావిడ కజకము ఆదిగాగల కులతత్వ పార్టీలు దీనికి తార్కాణము.

ఆధునిక రాష్ట్రములలో అనేక సమస్యలు పరిష్కారము చేయవలసియున్న అనేకమంది వ్యక్తులు అనేక విధములుగ వానిని పరిష్కారము చేయవచ్చును. కాని, ఒకే అభిప్రాయముగల వ్యక్తులందరును కలసి ఒక రాజకీయ పక్షములో చేరిన యీ పక్షములు ప్రజలయెదుట వారివారి అభిప్రాయములను చెప్పవచ్చును. ప్రజాస్వామ్యములో అన్ని పక్షములవారును వారివారి అభిప్రాయములను స్వేచ్ఛగా చెప్పవచ్చును. అందుచేతనే "The essential functions of Parties are to educate formulate and organise public opinion." అను మాటలలో చాల సత్యమున్నది. సరియగు ప్రజాభిప్రాయము వాటి మూలమున మాత్రమే ఏర్పడగలదు.

ఏ రాజకీయ పక్షమునకు హెచ్చు బలమున్నదో దానికే ప్రభుత్వాధికారము లభించును.

రాజకీయ పక్షములను స్థాపించుటలో జాతిమతముల కక్షలకు తావుండజాలదు. దేశాభివృద్ధినే పరమావధిగా పెట్టుకొని పాటుపడవలెను. స్వాతంత్ర్య భారతదేశము లౌకిక రాష్ట్రమై యున్నది. అందుచేత యీ విద్యుక్తధర్మము పాటింప బడవలసి యున్నది.

---

# పదకొండవ ప్రకరణము

## స్థానిక సంస్థలు

హెచ్చువిస్తీర్ణముగల దేశములలో, కేంద్ర ప్రభుత్వము, వివిధప్రాంతములలోని సమస్యలన్నిటిని పరిష్కారము చేయుట కష్టము. అందుచేతనే వివిధ దేశములలో స్థానిక ప్రాంతములకు కొంతవరకు స్వపరిపాలన హక్కులు యివ్వబడుచున్నవి. వాటివలన ఆయా ప్రాంతములోని ప్రజలకు పరిపాలనా బాధ్యత తెలియును. దీపములు, రోడ్లు, ప్రజారోగ్యము, మొదలగు విషయములను స్థానిక భాగముల చేతిలోపెట్టిన దేశమునకు ఎట్టి నష్టమునురాదు. పైగా స్థానిక భాగములలోని ప్రజలకు వారి సమస్యలు వారికి బాగుగా తెలియును. వాటిని వారే బాగుగ పరిష్కారము చేసికొనగలరు. అందువలన కేంద్రప్రభుత్వ భారముకూడ చాలవరకు తగ్గును.

దీనివలన ప్రజలలో ఒక నూతన ఉత్సాహము కలుగవచ్చును. రాజకీయ పరిజ్ఞానముకూడ కలుగును, దానితో, శాసనసభల ఎన్నికలలో వారివారి విధ్యుక్త ధర్మములను, మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు మొదలగు వాటి ద్వారా వ్యక్తులలో పెంపొంద చేయవచ్చును.

స్థానిక సంస్థలు సరిగా పనిచేసినయెడల కేంద్ర రాష్ట్ర ప్రభుత్వముల యొక్క ఆతురత తగ్గును. స్థానిక సంస్థలకు కావలసిన డబ్బు యిచ్చి వాటి ధర్మములను అవి గుర్తించునట్లు చేసిన దేశమునకు ఎంతో లాభము కలుగును.

హా

కేంద్రప్రభుత్వమునకు స్థానిక సంస్థలకు ఎట్టి సంబంధముండవలయును?—అనునది ఒక ముఖ్యమైన విషయము. అమెరికాలో ప్రభుత్వము ఎక్కువగా జోక్యము కలిగించుకొనదు. ఒక జిల్లాలో కలరాగాని, మసూచిగాని వచ్చిన కేంద్ర ప్రభుత్వము కలుగచేసికొన నక్కరలేకుండ అన్ని స్థానిక సంస్థలు పనిచేయునట్లు చూడవలయును. వారి రాబడి ఖర్చు మొదలగు లెక్కలను తనిఖీ చేయు హక్కు ప్రభుత్వమునకు ఉండవలయును. ఏ స్థానిక సంస్థ అయినను సరిగ వ్యవహరింపకపోయిన ప్రభుత్వమువారు వానిని రద్దు చేయవలయును.

స్థానిక సంస్థలు సర్వస్వతంత్రములని, ఎంతమాత్రము తలపరాదు. వారికి హక్కులు శాసనసభలు యిచ్చును గనుక, ఎప్పుడైనను సరే తిరిగి తీసికొనవచ్చును. ఎప్పుడైననుసరే, కేంద్రీకరణ సిద్ధాంతములవలన, అధిక లాభము లేదు. లాస్కీ చెప్పినట్లు ఇతర ప్రభుత్వ శాఖలకంటే, దానికి విద్యావ్యాప్తికి అవకాశము హెచ్చు గలదు.

# పన్నెండవ ప్రకరణము

## ఎన్నికలు

ప్రజాప్రభుత్వ మనగా ప్రజలయొక్క ప్రజలకొరకు ప్రజలచేత నిర్వహింపబడు ప్రభుత్వమని అమెరికా సంయుక్త రాష్ట్రములకు అధ్యక్షుడుగా పనిచేసిన అబ్రహాంలింకన్ నిర్వచించినట్లు నుడివియుంటిమి. ఐతే, "ప్రజలచేత" నిర్వహింపబడెడు ప్రభుత్వములో ప్రజలు తమ అభిప్రాయమును ప్రకటించుటెట్లు? ప్రజలు తమ ప్రతినిధులు ఎవరు కావలయునో ప్రకటించుటకు ఒక్కటే సాధనమున్నది. అదియే ఎన్నిక విధానము.

ఎన్నికలలో ప్రజలు వివిధ వ్యక్తులపైననే గాక వివిధ రాజ్యాంగ పద్ధతులపైనను, పక్షములపైనను కూడ తమ తీర్పును ప్రకటింతురు. ఒక దేశములోని ఎన్నికలపై ఆ దేశపు భవిష్యత్తు మాత్రమేగాక అంతర్జాతీయ పరిస్థితుల పరిణామము కూడ ఆధారపడును. ఉదాహరణకు ఇంగ్లండు దేశమందలి లేబరు కన్సర్వేటివ్ పక్షముల అంతర్జాతీయ వైఖరి విభిన్నమైనది. భారత దేశమున కాంగ్రెసు కమ్యూనిస్టు పక్షముల అభిప్రాయములలో కూడ భేదము కలదు. ఎన్నికలలో ఆ యా పక్షముల జయాపజయములపై ఆ దేశముల అంతర్జాతీయ విధానము మార్పు చెందక తప్పదు.

ఎన్నికలు వివిధములుగా నుండును. ఒకటి, ఎన్నికల ప్రాముఖ్యతను బట్టిన విభేదము. స్థానిక సంస్థలు, మునిసిపల్ సంఘములు మున్నగువానికి జరుగు ఎన్నికలు సాధారణముగ వ్యక్తి ప్రధానమైనవి. పరిపాలనకు సంబంధించినవి. కావున

వాని జాతీయ అంతర్జాతీయ ప్రాముఖ్యత తక్కువ. కాని, శాసనసభల ఎన్నికలకు రాష్ట్ర శాసనసభకు కాని జాతీయ శాసనసభలకు కాని, జరుగు ఎన్నికలకు రాజకీయ ప్రాధాన్యత అధికము

ఎన్నికలు జరుగు కాలమును, కారణమును బట్టి కూడ వానిని సాధారణ ఎన్నికలు = (జనరల్ ఎలక్షన్స్) = ఉప ఎన్నికలు = (బై ఎలక్షన్స్) = అనికూడవిభజింపనగును. సాధారణ ఎన్నికలు సాధారణ ఒకే కాలములో శాసనసభ గడువు ముగిసిన పిదప సభను పునర్నిర్మాణమునకై జరుగును. ఉపఎన్నికలు ప్రత్యేక నియోజకవర్గములలో ప్రత్యేక కారణముల వలన జరుగును. ఎన్నికైన సభ్యుడు మరణించుట, అనర్హుడుగా ప్రకటింపబడుట, తన పదవికి రాజీనామా ఇచ్చుట మున్నగునవి యిట్టి కారణములు. ఎన్నికలు జరుగు విధానమునుబట్టి కూడ వీనిని ప్రత్యేక ఎన్నికలు, పరోక్ష ఎన్నికలు అని రెండు విధములుగా విభజింపనగును.

ఎన్నికల నిర్వహణలో పాల్గొనవలసినవారు ముగ్గురు కలరు. ౧. ఎన్నుకోనబడు అభ్యర్థులు, ౨. ఎన్నుకోను ప్రజలు, 3 ఎన్నికల నిర్వహించు ప్రభుత్వాధికారులు. వీరి శీలప్రవర్తనము, శ్రద్ధ, నిదానము వీనిపైననే ఎన్నికల యొక్క నిర్వహణము, ప్రజాస్వామ్యము ఆధారపడును.

అభ్యర్థులు:- మన దేశమున ప్రజాప్రాతినిధ్య చట్టము ఎన్నికలలో పాల్గొన అర్హులగు వారెవరో నిర్వచించియున్నది. ఆ నిబంధనలకు లోబడి ఎవరైనా ఎన్నికలకు నిలబడవచ్చును. ఉదాహరణకు ప్రభుత్వాధికారులు తమ పదవులలో నున్నంత

కాలము ఎన్నికలకు అర్హులు కాజాలరు. అభ్యర్థులు రెండు రకములుగా నుందురు. ఒకరు స్వతంత్రులు, అనగా ఏ పక్షము వారి ప్రతినిధిగా గాక వ్యక్తిగతముగా ఎన్నికలలో నిలబడిన వారు. రెండవవారు పక్ష ప్రతినిధులు. గడచిన ఎన్నికలలో కాంగ్రెసు పక్షము మున్నగు రాజకీయ పక్షములు తమ ప్రతినిధులను నిలబెట్టి ఎన్నికలలో పాల్గొనియున్నవి. మన దేశమున మొత్తము ౩౭౭౨ నియోజక వర్గములనుండి ౪౪౧౨ మంది ఎన్నుకొనబడి యున్నారు. కాని ౪౪౧౨ స్థానములకు పోటీచేసినవారిసంఖ్య దీనికి చాల రెట్లుండును. ఎన్నికలలో పాల్గొనుటకై అభ్యర్థి దరఖాస్తును దాఖలు చేయుటను నామినేషన్ ఫైల్ చేయుట అందురు. దరఖాస్తు చేసిన వారిలోకొందరు అనర్హులుగా ప్రకటింపబడినను మిగిలిన పోటీదారుల సంఖ్యకూడ తక్కువ యుండెడు. ఎన్నికలలో అభ్యర్థులు పాటింపవలసిన నియమములనేకములు గలవు. చట్టరీత్యా వారు నిర్ణీత మొత్తమును మించి వ్యయమొనర్పరాదు. అదిగాక గడచిన ఎన్నికలలో నెహ్రూ పండితుడు పదేపదే హెచ్చరించినట్లు " ఎన్నికను చెడు విధానము వలన నెగ్గుటకంటె మంచి విధానమున ఓడుటయే మేలు......ఎన్నికలలో సాధారణ సభ్యతా మర్యాదలను విస్మరించు అలవాటున్నది. ప్రతి అభ్యర్థియు అతని పక్షీయులును తాము భారతదేశము యొక్క గౌరవమునకు రక్షకులమను మాటను మరువక ప్రవర్తింపవలసియున్నది".

ఎన్నుకొనువారు:- ఎన్నికలలో పాల్గొని తమ అభిప్రాయమును ప్రకటింప నర్హులు అగు ప్రజలకూటమిని ఎన్నికవర్గము అందురు. ప్రజలు అభ్యర్థుల పట్ల తమ అభిప్రాయమును

తమ సమ్మతులద్వారా ప్రకటింతురు. ఓటరుల సంఖ్య యిది వరకు చాల పరిమితముగ నుండెను. కాని నేడు వయోజను లందరకును ఓటింగు హక్కు లీయబడినవి. కావున మన దేశ మున సుమారు ౧౭ కోట్లమంది ఎన్నికలలో పాల్గొన నర్హుల యిరి. వీరి కర్తవ్యమేమి? ఒక ప్రసిద్ధ రాజకీయ శాస్త్రవేత్త చెప్పినట్లు వారి పని ౧. ఎన్నికలలో పాల్గొనుట ౨. తమ సమ్మతిని వివేకముతో ప్రయోగించుట ౩. తమ కర్తవ్యమును ధర్మపథమున నిర్వర్తించుట. ఎన్నికలలో పాల్గొనక అశ్రద్ధ చూపుట వలన గూడ ప్రజా ప్రభుత్వమున పౌరుడు దేశము నకు అపచారము చేయుచున్నాడు. అతడు ఎన్నికలలో పాల్గొ నిన వివిధ వ్యక్తుల అర్హతానర్హతలను వివిధ పక్షముల స్వరూప స్వభావములను వారి ఎన్నికల ప్రణాళికల యందలి గుణలోపములను చక్కగా అర్థము చేసుకొనవలయును. ఇందుకు అతనికి రెండు విధములగు అవకాశములున్నవి. ఒకటి వివిధ రాజకీయ పక్షముల వారి ప్రచారము, రెండు పత్రికలు మున్నగు వాటి ద్వారా లభించు విజ్ఞానము. అంతేగాక ఎన్నిక వర్గము ధనాపేక్షకు లొంగిగాని ఇతర ప్రతిఫలమును వాంఛించి గాని ఎన్నికలలో పాల్గొనినచో వారు నిజాయితీగా ప్రవర్తిం చినవారు కాజాలరు. అంతేగాక ప్రజాప్రాతినిధ్య చట్టము కొన్ని పనులను నిషేధించి యున్నది. ఒకరి పేర నొకరు ఓటు చేయుట, బాలెట్ పత్రమును దొంగిలించుట మొదలగునవి శిక్షార్హములగు నేరములు.

ప్రభుత్వాధికారులు:-1952 వ సం॥ ఎన్నికలలో రెండు లక్షల యిరువది నాల్గువేల పోలింగు కేంద్రములు పనిచేసెను. వానిని ప్రభుత్వాధికారులే నిర్వహింపవలసి యున్నారు. అందు

లకు 72 వేల కేంద్రాధికారులు రెండు లక్షల ఎనుబది వేల మంది సహాయాధికారులు పనిచేసి యుండిరి. ఎన్నికల నామనిర్దేశ పత్రములు స్వీకరించుట మొదలు ఎన్నికల ఫలితములు ప్రకటింపబడువరకు ఎన్నికల భారమంతయు ప్రభుత్వాధికారులపై నుండును. వారు ముఖ్యముగా ఏ వ్యక్తి ఎవరిని బలపరచును, అను విషయమును గోప్యముగా నుంచవలయును. మరియు, వివిధ అభ్యర్థుల యెడలను, రాజకీయ పక్షముల యెడలను నిష్పక్షపాతముగా ప్రవర్తింపవలయును.

ప్రజలు ఓటు చేయుటతో తమ పని పూర్తి అయినదని భావించకూడదు. ఎన్నికలలో కులబేధములు యితర ఆశలు లేకుండ సమర్థులనే బలపరచుట వారి కర్తవ్యము. ఎన్నికల తర్వాత పౌరసంఘముల ద్వారాను యితర విధములుగను తమ ప్రతినిధులు తమ విధులను నిర్వర్తించునట్లు చేయువలయును. "అప్రమత్తతయే స్వాతంత్ర్యముకోరు ప్రతిఫలము" అని లాస్కీ మహాశయుడు వాకొనెను గదా?

---

# పదమూడవ ప్రకరణము

## ప్రజాభిప్రాయము

ప్రజాస్వామ్యము గల దేశమునకు అధికారులు ప్రజలే. ప్రజల వాంఛల ననుసరించియే పరిపాలన సాగవలసియున్నది. ప్రజాభిప్రాయము ద్వారానే ప్రజలవాంఛ లెవ్వియో ప్రభుత్వము వారికి స్పష్టము కాగలదు. ప్రజాభిప్రాయమును స్పష్టముగా వెల్లడిచేయు ప్రధాన సాధనము ఎన్నికలే. వివిధ వ్యక్తులపైననేగాక వివిధ రాజకీయ పక్షములపైనను ప్రజలకు గల అభిప్రాయము ఎన్నికలలో స్పష్టమగును. మరియు, శాసనసభలో ప్రజా ప్రతినిధులగు సభ్యులు వెల్లడించు అభిప్రాయములు ప్రజలవాంఛలను, ఆశలను, ఆశయములను ప్రభుత్వము వారిదృష్టిలోనికి తేగలరు. ఇట్లు ప్రజాభిప్రాయాను గుణ్యముగ పరిపాలన నడుపుటయను సూత్రమునకు మన దేశమున పునాదులు వైచినవారు రిప్పన్ ప్రభువు.

ప్రజాభిప్రాయమును వ్యక్తముచేయు మరియొక సాధనము పత్రికలు. ఆర్థర్ మీ యను రచయిత వీనిని ప్రపంచ ప్రతిబింబమును చూపు దర్పణములని వచించియుండెను. టైమ్సు పత్రికకు ఆంగ్ల దేశమునను, న్యూయార్కు టైమ్సు వంటి పత్రికలకు అమెరికా యందును హిందూస్థాను టైమ్సు, హిందూ, అమృతబజారు పత్రికవంటి పత్రికలకు మన దేశము ననుగల పలుకుబడియే యిందులకు ప్రబల నిదర్శనము. పత్రికలు ఒక వంకను ప్రభుత్వ సమాచారమును ప్రజలదృష్టిలోనికి తేవలయును. మరియొక వంక ప్రజల అభిప్రాయములను సంపాదకీయములు, లేఖా ప్రకటనలు వార్తలద్వారా ప్రభు

త్వమునకు అందజేయవలయును. పత్రికలు న్యాయస్థానముల వలెనే సత్య సంధత నిష్పక్షపాతముతో వ్యవహరించిన ఎడల మాత్రమే యిట్టి కర్తవ్యములు నెరవేర్పగలవు. లీడరు పత్రికాధిపతి అయిన డాక్టర్ సి. వై. చింతామణి, మాంచెస్టర్ గార్డియన్ పత్రికాధిపతి అయిన సి. పి. స్కాట్ మొదలగు వారు ఇట్టి నిజాయితీ తోడను వ్యవహరించి, యితర పత్రికా రచయితల కాదర్శప్రాయులైరి.

ప్రజాభిప్రాయమును వెల్లడించు మూడవ సాధనము సభావేదిక. వక్తలుకూడ పత్రికాధిపతుల వలెనే ప్రజాభిప్రాయము దిద్దగలరు. భారతజాతీయ మహాసభ ౧౮౮౫లో జన్మించెను. ఆ సభవారి వార్షిక సమావేశములలో నీయబడిన ప్రసంగములద్వారా ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయము కనోగొన వీలగుచుండెను. సర్ ఫిరోజిషా మెహతా, సురేంద్రనాథబెనర్జీ, శ్రీనివాసశాస్త్రి, బిసెంట్, దాదాభాయినౌరోజి మున్నగు వారి ప్రసంగములు యిటు ప్రజాభిప్రాయమును దిద్దుచు అటు ప్రజాభిప్రాయమును ప్రజలకు వ్యక్తము చేయుచుండెను. మరియు, రాజకీయములకు సంబంధించిన ప్రత్యేక సమావేశములు కొన్ని గలవు. అవి ప్రత్యేక విషయములపై తమ సమావేశములలో చర్చించి తీర్మానములు చేయును. అఖిలభారత ఆర్థిక మహాసభ, అఖిలభారత విద్యామహాసభ అఖిలభారత స్థానిక సంస్థల మహాసభ మొదలగునవి యిట్టివే.

అనేక గ్రామములలో పౌరసంఘములు కలవు. అవి పన్నులచెల్లించు పురజనుల యొక్క క్షేమమును రక్షించుచు వారి అవసరములను స్థానిక సంస్థలవారి దృష్టిలోనికి తెచ్చును.

ఈ నాడు రేడియోలు మిగుల వ్యాప్తిలోనికి వచ్చినవి. అవి గ్రామములలో కూడ ప్రజలకు విద్యా వివేకముల నీయగలవు, రేడియోలు చక్కని కార్యక్రమములద్వారా మంచి ఉపన్యాసముల నేర్పాటు చేసినయెడల నిరక్షరాస్యత అధికముగా నున్న మన దేశమున ప్రజలలో చక్కని విజ్ఞానము వెదజల్లగలవు. ప్రయోజన విద్యకు తోడ్పడగలవు. అనుబంధ పాఠశాలలు కూడా కాగలవు.

---

# పదునొల్గవ ప్రకరణము

## దారిద్ర్యము - వ్యవసాయ పరిశ్రమలు - సహకార సంఘములు.

ఒకనాడు మన దేశము సిరి సంపదలకు పుట్టినిల్లై యుండెను. మన సంపదలు విదేశీయుల నాకర్షించెను. మన వస్త్రములపై వ్యామోహముతో మన దేశమునకు యితర దేశముల ధనము వచ్చి వేయుచున్నదని విదేశీయులు వాపో యిరి. మన సౌభాగ్యమును విదేశ యాత్రికులు విపులముగ వర్ణించిరి. మన నౌకలు వివిధ సముద్రములలో విహరించు చుండెను.

అది పూర్వపుగాథ. పిదప దరిద్రమే మన స్నేహితుడై నది. తిన తిండి, కట్టబట్ట కొదవైనవి. గ్రామములు పాడైనవి. బ్రిటిషువారి సంపదకు అవకాశము నొసగునది మనము. నిత్య దారిద్ర్యముతో అలమటింపవలసిన వారము మనము అయి తిమి. ఇట్టి పరిస్థితుల స్వభావ స్వరూపములను దాదాభాయి నౌరోజి భారతీయ దారిద్ర్యము అను పేరుగల ఒక గ్రంథ మున చక్కగా చర్చించినాడు. నేటి ప్రశ్న దారిద్ర్యమును ఎట్లు నిర్మూలించుట యనునది. ఇందులకు మనకు అవకాశ ములు యెన్నియోగలవు.

అందు మొదటిది బ్రిటిషువారి పరిపాలన తొలగినది. లంకషైర్, మాంచస్టరుల పరిశ్రమల సంరక్షణకై పరితపించు పరిపాలకులు నేడులేరు.

రెండవది మన దేశములో సహజ సంపదలు గలవు. మానవశక్తి, ముడి సరకులు, చీలి శ్రేకస్నను మిక్కిలి నిడి వైనదని చెప్పబడిన తీరరేఖ, సారవంతమగు భూమి, నిడివి గల నదులు మొదలగునవి గలవు.

మూడవది యిటీవల యుద్ధకాలమున అనేకులు మన యువకులు యుద్ధ పరిశ్రమలలో తరిఫీదయి యుండిరి. అంతే గాక నేటి మన విశ్వ విద్యాలయములు కేవలము సారస్వత పట్టము లిచ్చుటతో తృప్తిపడక ఇంజినీరింగు మొదలగు శాస్త్రములలో తరిఫీదుల నిచ్చుచున్నవి.

నాల్గవది ధన సహాయము విషయములో అనేక ప్రపంచ ఆర్థికసంస్థలు పారిశ్రామికముగా వెనుకబడిన దేశములకు ఆర్థిక సహాయము చేయుటకు నెలకొల్పబడినవి.

ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమమున వృద్ధి పొందవలసినవి రెండు. ఒకటి వ్యవసాయము, రెండు పరిశ్రమలు.

వ్యవసాయము విషయములో వ్యవసాయ దేశీయులమైన మనము పారిశ్రామిక దేశములనుండి ఆహారము కోర వలసి వచ్చినదనిన మన పరిస్థితి స్పష్టము కాగలదు. మన రైతుల అజ్ఞానము, తాత ముత్తాతలనాటి పద్ధతులు, భూమి వేర్వేరు కారణములవలన ముక్క చెక్కలగుట, ఋణభారములో మునిగిన రైతుకు భూమిపైన సరియైన శ్రద్ధవహించుటకు వీలులేకపోవుట – ఎరువులు, సహకార సంఘములు మొదలగు వాని వలని మేలు గ్రహింపక పోవుట మున్నగునవి యిందులకు కారణములు. ఈ పరిస్థితులను మార్పు చేయవలయును.

ఎరువులు మొదలగునవి వ్యాప్తిలోనికి తెచ్చి భూసారమును కాపాడవలయును. సహకార సంఘములను విరివిగా ఏర్పాటుచేయవలెను. దున్నువానికి భూమిపై అధికమగు హక్కులనొసగి తద్వారా వానికి భూమిపై యదార్థమగు శ్రద్ధను పెంపొందించుటకు గూడ కృషి జరుగుచున్నది. హైదరాబాదు వారు యీ విషయములో యిదివరకే ముందంజవేసి కౌలుదారీ చట్టమును చేసియున్నారు.

ఇటీవలివరకు మన దేశమున గల సమస్యలలో ఆహార సమస్య యొకటి. మనము విదేశములనుండి ఆహార ధాన్యములను దిగుమతి చేసికొనవలసిన దుస్థితిలోనుంటిమి. దీనికి గాను హెచ్చు భూమిని సేద్యములోనికి తేవలయును. ఇందులకు గాను గోదావరి మున్నగునదులపై పెద్ద ప్రాజక్టుల నిర్మించిన అడవులుగ, బీడులుగ జలాధారములు లేక పడియున్న భూమి వ్యవసాయమున కనువగును. అయితే పెద్ద ప్రాజక్టులు ఎంతె ఆవశ్యకములైనను వానికి కావలసిన ధనము అపరిమితము. వానినిర్మాణమునకగు కాలము దీర్ఘమైనది. కావున ఉప జలాధారములను (Minor irrigation Projects) వెంటనే ప్రారంభింపవలయును. తయారైన పంటను రవాణా చేసికొను సదుపాయములుగూడ వ్యవసాయాభివృద్ధి కావశ్యకములు.

పరిశ్రమాభి వృద్ధి:-పరిశ్రమల విషయముననూ మనము వెనకబడియే యున్నాము. మనకన్న, చిన్నవైన అనేక యూరోపియన్ దేశములు మనకన్న ముందుకు వచ్చినవి. వ్యవసాయములో పరిశ్రమలు లేనిచో మనము వెనుకటి మాదిరిగా ముడి సరుకులు నెగుమతి చేయు దేశముగా నుండ

వలసి వచ్చును. కావుననే సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య అను ప్రముఖుడు మన పరిశ్రమల నుద్ధరింప వలెను. లేదా నశించుటకు సిద్ధముకావలెనని నుడివియున్నాడు.

పరిశ్రమలను అనేక రకములుగా విభజింప వచ్చును. వ్యక్తుల అధీనములు, ప్రభుత్వ అధీనములు అని రెండు భాగములు చేయవచ్చును. ప్రభుత్వాధికారము చేసికొనుటను (Nationalisation) అని చెప్పుదురు. సాధారణముగా కీలక పరిశ్రమలు ప్రభుత్వాధిపత్యమునను యితరములు వ్యక్తుల చేతులలోను ఉండవచ్చుననునది పెక్కుమంది అంగీకరించు సూత్రము.

పరిశ్రమలను గృహ పరిశ్రమలు, యంత్ర పరిశ్రమలు అని గూడ విభజింప వచ్చును. నేడు ఇనుము, బట్టలు మున్నగు కొన్ని విషయములలో మాత్రమే మనకు చెప్పికొనదగిన పెద్ద పరిశ్రమలున్నవి. విశాఖపట్నములో నౌకానిర్మాణము, జంషడ్‌పురమున ఇనుప పరిశ్రమ, కోయంబత్తూరు, అహ్మదాబాదు మొదలగుచోట్ల బట్టల యంత్రములు పని చేయుచున్నవి. యంత్ర పరిశ్రమల అభివృద్ధికి పెట్టుబడి, మానవశక్తి మొదలగున వెన్నియో ఆవశ్యకములు గలవు. ప్రజలు సహకరించి పెట్టుబడి విషయములో తోడ్పడ వలయును. ప్రభుత్వము దిగుమతుల నాపి విదేశీయుల పోటీని తగ్గించవలయును. విశ్వవిద్యాలయమువారు వృత్తి విద్యలను చక్కగా ప్రోత్సహించి పారిశ్రామిక కార్యక్రమమునకు వలయు నిపుణులను తయారు చేయవలయును. కార్మికుల హక్కులను యజమానులు, యజమానులసమస్యలను కార్మికులు గుర్తించి ఉభయులు ప్రభుత్వముతో సహకరించవలయును.

కుటీర పరిశ్రమలు:- మన దేశమునగల కుటీర పరిశ్రమలు ప్రాచీనమైనవి. కొండపల్లి బొమ్మలు, విశాఖపట్నపు దంతపు సామాను, కాశ్మీర శాలువలు, ఢక్కా మజ్లినులు మున్నగునవి చక్కని నైపుణ్యముతో చేయబడి అనేకులచే నుతింపబడినవి. ఏనాడో లండనులో జరిగిన సామ్రాజ్య ప్రదర్శనములో ఒరంగల్లు తివాసీలు ప్రథమ బహుమతి పొందినవి. కాని ఈ పరిశ్రమలు యంత్ర పరిశ్రమలతో పోటీచేయలేక ప్రభుత్వ ప్రోత్సాహము లేక ప్రజలలో విదేశ వస్తువ్యామోహము ప్రబలి నశింపసాగినవి. కాని యిటీవలి కాలమున వాని పునరుద్ధరణకు అనేక కారణములచే నవకాశము చిక్కినది.

గాంధి మహాత్ముని గ్రామ పునరుద్ధరణ కార్యక్రమము. డాక్టరు జె. సి. కుమారప్ప మొదలగు ఆర్థికవేత్తలు ఆయన తత్వమును ఆర్థిక శాస్త్రదృష్ట్యా సమర్థించి ఆర్థిక విషయములను క్రొత్తవెలుగులో పరీక్షింపసాగిరి. స్వాతంత్ర్యోద్యమమున నొక భాగమైన విదేశ వస్తు బహిష్కరణము గ్రామవాసులచే నిర్మితములగు వస్తువుల నుపయోగింపవలెనను ఉత్సాహమును హెచ్చించెను.

ప్రజలు క్రమముగా దేశాభివృద్ధికి పెద్ద పరిశ్రమలను ప్రోత్సహించుటయే తారక మంత్రముగాదనియు, కుటీర పరిశ్రమలను గూడ ప్రోత్సహించ వలయుననియు పెద్ద పరిశ్రమలలో గల కొన్ని లోపములు గృహ పరిశ్రమలలో లేవనియు యివి రెండును వేర్వేరు రీతుల ఉపయోగించుననియు గుర్తింపసాగిరి.

అనేక రాష్ట్రప్రభుత్వములు క్రమముగా వీని అవసరము గుర్తించి ప్రదర్శనముల ద్వారాను విక్రయశాలల మూలమునను వీని పనితనమును ప్రదర్శించియు దీనికి ధన సహాయము చేసియు ప్రోత్సహింపసాగినవి. ఉదాహరణకు హైదరాబాదు రాష్ట్రమున బీదరులో బిదరీవేర్ పరిశ్రమయు, సిద్ధిపేటలో సిల్కులును, నిర్మల్ ఆటవస్తువులును, ఒరంగల్లు తివాశీలును పేరు పొందినవి. ఇందులకు ప్రభుత్వము చేనేత మున్నగు పరిశ్రమలలో తరిఫీదిచ్చుటకు Village Industries Training Centre అను సంస్థను నెలకొల్పియు, వస్తు విక్రియమునకై Sales Depot అను విక్రియ కార్యాలయము నేర్పరచియు, ఒక పంచవర్ష ప్రణాళికను రచించి తద్వారా Industrial Cooperatives అనగా పారిశ్రామిక సహకార సంఘములు నెలకొల్పియు ప్రోత్సహించుచున్నది. అట్లే ప్రభుత్వము వారు తమ కార్యాలయములకు వలయు అనేక పరికరములను కొనియు, యితర విధములను యీ పరిశ్రమలకు తోడ్పడు చున్నారు. కమ్యూనిటీ ప్రాజెక్టులు, యితర ప్రాంతాలలో కూడ శిక్షణ కేంద్రాలు గలవు.

నేటి వస్తువులకొదువలో ఉత్పత్తి (Production) హెచ్చించుటకును నిరుద్యోగము నిర్మూలించుటకును వీని ఆవశ్యకత గుర్తింపబడినది.

ఇటీవల డాలర్ అనబడు అమెరికన్ నాణెము వహించిన ఆర్థిక ప్రాముఖ్యత తెలిసియే యున్నది. విదేశము లందలి మన రాయబారులు ఈ వస్తువులయెడ విదేశీయులు ఆదరణ చూపుచుండిరని వాకొనియున్నారు. కావున ఈ

వస్తువులద్వారా ఇంకను నాణెములను కూడ సంపాదింప వచ్చునని ప్రభుత్వము గుర్తించుచున్నది.

గ్రామములలో న్యూనపాయ సంస్కరణలు ప్రవేశ పెట్టబడినవి. హాలికునకు తీరిక కాలములో పని కల్పించి అదనపు ఆదాయమును తెచ్చు గృహ పరిశ్రమలను పెంపొం దించిననే అవి జయప్రదమగునను భావము ప్రబలుచున్నది.

గృహ పరిశ్రమల అభివృద్ధికి అత్యంతావశ్యకములైన విషయములు రెండు. అందు మొదటిది ఉత్పత్తికి సహాయము. ముఖ్యముగా వాని ఉత్పత్తి వ్యయము తగ్గిన కాని అవి యంత్ర పరిశ్రమలద్వారా ఉత్పత్తియైన వస్తువులతో పోటీ చేయ జాలవు. మైసూరు రాష్ట్రమందువలె చిన్నయంత్రముల నుప యోగించుటద్వారా ఉత్పత్తియైన వస్తువుల నాణ్యముగ చేసినయెడలనే వానిని కొనువారుందురు. కావున అందు చక్కని పరిశోధన, కర్మకారులకు చక్కని తరిఫీదు మిక్కిలి ఆవశ్యకములై యున్నవి. ఈ విధముగా పనితనమును హెచ్చించియు, ఖర్చును తగ్గించియు విదేశములలో విక్రి యించుటకు పంపి మన రాయబారుల సహాయము స్వీకరిం చియు, ప్రభుత్వావసర వస్తువుల నందుండియే ఖరీదు చేసియు, అవి అమ్మకమగుటకు వలయు పరిస్థితులు కల్పింపవచ్చును.

మన ప్రజలలో దారిద్ర్యము పోవలయునన్న, వివిధ ప్రాంతములలో లభ్యమగు ముడి సరకులు గృహపరిశ్రమ లలో ఉపయోగించవలయును. వీటికి అంతగా పెట్టుబడి అక్కర లేదు. దేశములో ఉత్పత్తి హెచ్చినగాని, ప్రజల కొనుగోలు శక్తి హెచ్చదు. అందుచేతనే, రెండవ పంచవర్ష ప్రణాళి

కలో, కుటీరపరిశ్రమలకు ముఖ్యస్థానము ఇయ్యబడినది. ప్రజలు కూడ వీటిని పోషించవలసిన బాధ్యత గలదు.

**సహకార సంఘములు:—** మన దారిద్ర్య నిర్మూలన కార్యక్రమమున వ్యవసాయము అటు కుటీర పరిశ్రమలకు గూడ తోడ్పడగల సంస్థలు సహకార సంఘములు. వ్యక్తి సంఘమునకు, సంఘము వ్యక్తికి తోడ్పడవలయునను భావము నివి ప్రోత్సహించుచున్నవి. ఈ సంఘములు అప్పులనిచ్చి పుచ్చుకొనునవి, వస్తు నిర్మాణ పంపకముల కేర్పడినవి అని రెండు రకములు. అవి ఇటు పట్టణములలోను అటు గ్రామములలోను కూడ వ్యవహరించుచు, ఇటు బ్యాంకువలె ధనమును దాచుకొననోపువారికి సహకారులై అటు న్యాయమగు ఋణదాతవలె స్వల్ప వడ్డీలకు అప్పిచ్చుచు వాయిదాలపద్ధతిని రాబట్టుకొనుచు రైతు జనమునకు తోడ్పడును. వారిని ఋణదాతల బారినుండి రక్షించును.

వస్తు సహకార సంఘముల విషయములో డెన్మార్కు దేశము ముందుకు వచ్చినది. అట్టి సంస్థ నొకదానిని హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వము కుటీర పరిశ్రమల పంచవర్ష ప్రణాళిక క్రింద నెలకొల్పినది.

సహకారోద్యమములో మనము గుర్తింప వలసిన ప్రధాన విషయములు నాల్గున్నవి. ఇవియే దాని ప్రాముఖ్యతకు కారణములు.

దాని ఆశయము ఉన్నతమైనది. దేశములో కష్టనష్టములు లేక ఆర్థిక సమానత్వము తెచ్చుటకు "All for each and each for all" భావముకన్న ఉత్కృష్ట మార్గము

లేదని విజ్ఞులు గుర్తించినారు. కావుననే ఫిలిప్పైయిను దీవులలో "సహకరించు లేక ఆవిరిగా" అను సామెత వ్యాప్తినొందెను. (Co-operate or evaperate).

ఆర్థిక రంగమున సహకారోద్యమము మన రాజకీయ ఆశయములకును అటు సాంఘిక జీవనమునకును కూడ అనుగుణ్యమైనది.

ఇందుకు అటు పరిమితిలేని ప్రభుత్వ నిర్బంధము కాని ఇటు విచ్చలవిడి నిర్వహణ స్వాతంత్ర్యముగాని యుండక ఒకవంక ఎన్నికైన డైరెక్టరులు మున్నగువారు కార్యనిర్వహణము చేయుచుండ మరొకవంక రిజిస్ట్రారు, ఇనస్పెక్టరులు మున్నగు ప్రభుత్వోద్యోగులు ఈ నిర్వహణ విధానము, నియమబద్ధముగ నుండునట్లు చూచుచుందురు. చెన్నపురిలో ట్రిప్లికేన్ సహకార సంఘము వంటి సంస్థలు యుత్సాహుల చేతిలో ఈ సంఘములు ఎంతటి కృషి జరుపగలరో ఋజువు చేసినవి.

ఇటీవలి కాలమున సహకార సంఘములు తాము పరిస్థితులతోపాటు మార్పు చెందగలమని ఋజువు చేసినవి. ఇండ్లకొదువను తీర్చుటకు గృహనిర్మాణ సంఘము లేర్పడుట యుద్ధమూలముగ కిరసనాయిలు మొదలగు వస్తువులకు కొదవ కల్గినపుడు ఆ వస్తువుల పంపకములో నివి చేసిన కృషి. శ్లాఘనీయమైనది.

ఇందు వ్యక్తులకు మితిమీరిన ప్రాబల్యముండదు. కార్యనిర్వాహక వర్గము అందరి సమ్మతులపై నేర్పడును. ఏ ఒకరి పెట్టుబడియు ఒక పరిమితిని దాటి యుండదు. గ్రామ

సహకార సంఘ సభ్యుల బాధ్యత సామాన్యముగ వాటా సొమ్మునుదాటి యుండదు.

మన ప్రాచీనులు ప్రతి గ్రామమునకు "అప్పిచ్చువాడు వైద్యుడు...మొదలగు వారు కావలయునని చెప్పిరి. సహకార సంఘము అప్పిచ్చుటయే గాదు, గ్రామములలో పాతుకొని పోయిన దారిద్ర్యము, స్వార్థభావము, ఋణభారము మొదలగు వ్యాధుల నివారణ చేయగల వైద్యశాలలు గూడ నై యున్నవి.

వ్యవసాయదారులకు అప్పులు యిచ్చుటకు, అనుభోక్తల అభివృద్ధికి, పారిశ్రామికులకు పరపతి యిచ్చుటకు గ్రామములలోగాని పట్టణములలోగాని గృహములు నిర్మించుటకు, ఆరోగ్యము కాపాడుకొనుటకు, యింకా ఎన్నోయితర విషయములలోను, సహకార సంఘములే మనకు ఎంతో సేవ చేయగలవు. భారతదేశము సహకార సమాఖ్యనిర్మాణమునకు సిద్ధముగా ఉన్నది. సామ్యవాద వ్యవస్థకుకూడ సిద్ధముగా నున్నవి. దానిని నిర్మించుటలో సహకార సిద్ధాంతమే మనకు ఎంతో తోడ్పడగలదు. మనకున్న అనేకమైన కోరికలు, ఒకరితో ఒకరు సహకరించినపుడే, కొనసాగగలవు. ప్రాచీన భారతదేశములో కూడ యీ సిద్ధాంతము అమలులో ఉన్నట్లు చరిత్ర చెప్పుచున్నది. సహకార సిద్ధాంతమే మనకు శరణ్యామని వేరే వ్రాయనక్కరలేదు.

---

# పద్మనైదవ ప్రకరణము

## కమ్యూనిటీ ప్రాజెక్టులు

కమ్యూనిటీ ప్రాజెక్టు విధానము పంచవర్ష ప్రణాళికలో నొక అంతర్భాగమై యున్నది. దీని ప్రధానాశయము గ్రామాభ్యుదయము. ఈ ప్రణాళికలోని ప్రత్యేకత గ్రామాభ్యుదయ కార్యక్రమమును సమగ్రముగాను బహుముఖము గను నిర్వహించుట. ఈ నిర్వహణ కార్యక్రమములో ఒక రంగమునకు మరియొక రంగమునకును మధ్య సమన్వయము కల్పించుటయు ప్రభుత్వ కృషికితోడుగ గ్రామస్థుల స్వయం కృషిని జోడుచేసి గ్రామస్థులుకూడ ధనరూపమునగాని కృషి రూపమునగాని సహకారము నిచ్చునట్లు చేయుటయు కూడ ఇందలి ప్రత్యేక విశేషము. ఇంతవరకు భారతదేశమందు 229 కమ్యూనిటీ ప్రాజెక్టులు నెలకొల్పబడినవి. హైదరాబాదు రాష్ట్రమున 3 జిల్లాలలో అనగా వరంగల్లు, నిజామాబాదు, రాయచూరు జిల్లాలలో నివి నెలకొల్పబడినవి. ప్రతి కమ్యూనిటీ ప్రాజెక్టు క్రిందను 300 గ్రామములుండును. అనగా వైశాల్యమును బట్టి 450 – 500 చ॥మైళ్ళు గల ప్రదేశము దీని క్రిందనుండును. అందలి జన సంఖ్య సుమారు 2 లక్షలు వ్యవసాయము చేయబడెడు అందలి భూమి సుమారు 1½ లక్షల ఎకరములు నై యుండును. ప్రాజెక్టు కార్యక్రమ మును నిర్వహించుటకు Executive Officer అను కార్య నిర్వహణాధికారి యుండును.

ప్రతి ప్రాజెక్టు ప్రదేశము మూడు డెవలప్మెంటు బ్లాకుల క్రింద విభజింపబడును. ప్రతిబ్లాకు అయిదు గ్రామ

ములు గల సమూహములుగ విభజింప బడును. ప్రతి గ్రామమున్నూ గ్రామ లెవెల్ వర్కరు అను వాని క్రిందనుండును. వీనికి తర్ఫీదు నిచ్చుటకు ఫోర్డు ఫౌండేషనువారి సహాయముతో ఒక బోధనాశాల నెలకొల్ప బడినది. వివిధ విషయముల సమన్వయ మీఉద్యోగి చేతనే నిర్వహింపబడును.

ప్రభుత్వశాఖలవారు సహాయముచేసిననూ ప్రధానముగా ఇందుకు కృషిచేయవలసిన వారు ప్రజలే. వారు కృషి చేయవలసిన రంగములు వ్యవసాయము, రాకపోకల మార్గములు — విద్య, ఆరోగ్యము, ఉపవృత్తులు, నివాస సౌకర్యములు, సాంఘికాభ్యుదయము. ప్రజలయందు ఉత్సాహము కలుగచేసి వారిందు పాల్గొనుటకవకాశము కల్గించుటకు భారతసేవక సంఘమును సంస్థ నెలకొల్పబడినది.

ఈ కమ్యూనిటీ ప్రాజెక్టుల విధానము ముఖ్యముగా వ్యవసాయమునకు సంబంధించియున్నదను ఒక విమర్శ గలదు. కాని నేటి మన ప్రధానసమస్య ఆహార సమస్య. మన ప్రజల ముఖ్య వృత్తి వ్యవసాయము. మనది గ్రామములతో నిండిన దేశము అట్టి పరిస్థితిలో వ్యవసాయము తదనుబంధిత విషయములకు ప్రాధాన్యత లభించుట సహజమే.

ఈ కమ్యూనిటీ ప్రాజెక్టు విధానమువలన మన ప్రజల జీవన ప్రమాణము పెంపొంది మన గ్రామసీమలు అభ్యుదయము గాంచునని ఆశించెదముగాక. అనగా రోడ్లను వృద్ధి చేయుట, గృహ పరిశ్రమలను పెంపొందచేయుట, పాఠశాలలు స్థాపించుట, పశువుల అభివృద్ధికి తోడ్పడుట సహకార సంఘములు స్థాపించుట, గ్రామసీమల సర్వతోముఖాభివృద్ధికి

తోడ్పడుట, సామాజిక ప్రాజెక్టులయొక్క ముఖ్యపరమావధి. యిది జయప్రదముగా జరుగుటకు ప్రజలు తోడ్పడవలసి యున్నది. యిది ప్రజాభ్యుదయ కార్యక్రమము. దీనిలో ప్రభుత్వమువారు కూడ తోడ్పడెదరు. కాని గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి ప్రజలే శ్రద్ధ వహించవలెను. మన రాష్ట్రములో అనేకచోట్ల ప్రజలు విరివిగా విరాళములు, శ్రమదానము, ధనసహాయముచేసి, యీ కార్యక్రమమునకు ఎంతో తోడ్పడియున్నారు. కొన్ని సంవత్సరములలో దేశము లోని అన్ని ప్రాంతములలోను జాతీయ విస్తృత కేంద్రములు స్థాపింపబడును. ప్రజలు, వారివారి గ్రామాల అభివృద్ధికి, ప్రభుత్వ సహాయముతో తోడ్పడవలయును. కొన్ని దినముల తరువాత, వారే పూర్తి బాధ్యత వహించవలెను. ఆ నాడే మన గ్రామసీమ, అభివృద్ధి పొందగలదు. కనుక. కమ్యూనిటీ ప్రాజెక్టులు, ప్రజల ఉద్యమమని, కేవలము ప్రభుత్వము వారిదికాదని గుర్తించవలయును.

# పదునారవ ప్రకరణము

## విద్యా విధానము

విద్యయనగా జ్ఞానమును ఇచ్చునది. జ్ఞానము లేనివాడు పశువుతో సమానుడు. విద్యను రెండు భాగములుగా విభజించవచ్చును. ఒకటి సాధారణ విద్య, రెండు వృత్తి విద్య. నేటి సాధారణవిద్యకు పునాదులు బెంటింగ్ ప్రభువు పరిపాలనా కాలమున అతని కార్య నిర్వాహక వర్గమున సభ్యుడైన మెకాలే అను వానిచే వేయబడినవి.

సాధారణ విద్యా భవనమున మొదటి సోపానము ప్రాథమిక విద్య. గోఖలే మొదలగు ప్రముఖులు యిది ప్రజలందరకును నిర్బంధమును ఉచితమును కావలయునని కృషి చేసి యున్నారు. నేడు దీనిని హైదరాబాదు రాష్ట్రమున ప్రవేశపెట్టుటకు ప్రభుత్వము వారొక శాసనము చేసి యున్నారు. ఇందువలన ప్రజా ప్రభుత్వమున ప్రజలు తమ కర్తవ్యమును సక్రమముగా నిర్వహింపగలరు. ఈ ప్రాథమిక పాఠశాలలు రెండు విధములు. ప్రభుత్వ పాఠశాలలు, ప్రభుత్వేతర పాఠశాలలు. నేడు అనేక గ్రామములలో ప్రభుత్వ పాఠశాలలు గలవు. విద్యా విషయములలో వెనుకబడిన హరిజనులు మొదలగు వారికి ప్రత్యేక పాఠశాలలున్నవి. ప్రభుత్వేతర పాఠశాలలకు ప్రభుత్వము ధన సహాయము చేయును. పరిశోధికారులు ప్రభుత్వము తరఫున వీనిని పరీక్షింతురు.

సెకండరీ విద్య:— సాధారణ విద్యాక్రమమున నిది రెండవ మెట్టు. సెకండరీ పాఠశాలలను రెండు విధములుగా

విభజింపవచ్చును. ఒకటి మాధ్యమిక పాఠశాలలు. రెండవది ఉన్నత పాఠశాలలు. ఉన్నత పాఠశాలలో విద్య ముగిసిన తర్వాత ఆ విద్యార్థులకు సమిష్టిగా పరీక్ష జరిపి అందు ఉత్తీర్ణులను కళాశాల విద్యార్థులుగ ప్రకటింతురు. ఈ పాఠశాలలలో గూడ కొన్ని ప్రభుత్వేతర పాఠశాలలు గలవు. ఇటీవల స్త్రీ విద్యావ్యాప్తికై పెక్కు బాలికా పాఠశాలలు నెలకొల్పబడినవి.

ఉన్నత విద్య అనగా కళాశాలలో గరుపబడు విద్య. చెన్న రాష్ట్రమున యస్. యస్. యల్. సి. అను పరీక్షను గాని హైదరాబాదు రాష్ట్రమున హెచ్. యస్. సి. పరీక్ష యందు గాని (ఇట్లే వివిధ రాష్ట్రములలో) ఉన్నత పాఠశాలలలో విద్యను ముగించి పరీక్షయందు ఉత్తీర్ణులైనవారు యిందుల కర్హులగుదురు ఈ కార్యక్రమమును నడిపించు సంస్థపేరు హె. యస్. సి. బోర్డు. ఉన్నత విద్య అంతయు విశ్వవిద్యాలయమువారి ఆధీనమున నుండును. మన ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు బి, ఎ., యమ్. ఎ., మొదలగు సాధారణ విద్యా పట్టములకేగాక వైద్యము, విద్యాబోధన, ఇంజనీరింగు, న్యాయశాస్త్రము మొదలగు శాఖలలో M.B., B.S., L.L.B., L.L.M., B.T., B.E.D. మొదలగు పట్టముల నొసంగు విద్యా శిక్షణకు ఏర్పాటు చేసియున్నారు. విశ్వవిద్యాలయము వారి స్వాధీనమున అనేక ప్రదేశములలో ఉన్నత విద్య గరుపు ప్రయివేటు సంస్థలు గలవు.

విద్యా శాఖకు ప్రధానాధికారి డైరెక్టరు (నాజిమ్) సెకండరీ విద్య అతని ఆధీనములో నుండును. అతనిక్రింద

ఉపాధికారులు, సహాయాధికారులు, జిల్లా అధికారులు ఉందురు.

విద్యా విధానములో చాల మార్పులు రానున్నవి. ప్రాథమిక విద్యావిధానము బేసిక విద్యావిధానముగా మారనున్నది. అనగా, వృత్తులద్వారా విద్య నేర్పబడును. ఉన్నత పాఠశాలలు కూడ, బహువిధ ఉపయోగ (Multi purpose) పాఠశాలలుగా మారును. విశ్వవిద్యాలయములలో కూడ విద్యా విధానములో ఎన్నో మార్పులు రానున్నవి. ఏది ఎట్లున్నను, నూతన విద్యా విధానములో, వృత్తి విద్యకు ఎక్కువ తావుండును. అదే భారత దేశ ప్రజలకు శరణ్యము.

# పదునేడవ ప్రకరణము

## ప్రజారోగ్యము

ఆరోగ్యముయొక్క ఆవశ్యకతను వేరుగా చెప్పనక్కర లేదు. చక్కని ఆరోగ్యము మంచి మానసిక శక్తి నొసంగు నని సామెత గలదు. మన దేశమునందలి సగటు ఆయుః ప్రమాణమే ప్రజారోగ్యము విషయములో జరుగవలసిన కృషిని స్పష్టము చేయుచున్నది. ప్రసూతి మరణములు, మలేరియా, క్షయ మున్నగు వ్యాధుల వలన మరణములు మన దేశమునందు మిక్కిలి యెక్కువ. ఈ పరిస్థితులకు మూడు కారణములను పేర్కొన వచ్చును.

ఇందు మొదటిది అజ్ఞానము. మన దేశమున నిరక్షరాస్యులు పెక్కురున్నారు. వారి మనస్సులు మూఢత్వమునకు పుట్టినిండ్లు. ఛాందసమునకు ఆటపట్లు. క్షయ రోగితో కలిసి భుజించుట మున్నగు వానిని వర్జింపవలయునని కాని, టైఫాయిడ్ మున్నగు వ్యాధి పీడితులయొద్దకు పోవుటలో కొన్ని నియమములు పాటింపవలయుననిగాని, మశూచి మొదలగు వ్యాధుల నెదుర్కొనుటలో మానవ ప్రయత్నమునకు తావు కలదనిగాని వారికి తెలియదు. ఒకరు చెప్పినను గ్రహింపరు. కావున విద్యావ్యాప్తి చేయుటతో పాటు విద్యాధికులు అజ్ఞానులకు ఈ విషయము లన్నియు బోధింపవలయును. ఆరోగ్యవారములు మొదలగు కార్యక్రమము లిందులకు తోడ్పడుచున్నవి.

రెండవది దారిద్ర్యము. పండ్లు తినుట (తీసుకొనుట) కాని, వలసినన్ని పాలను సేవించుటకాని, తుదకు పుష్టికరమగు

సాధారణ ఆహారమునైనను వలసినంత పుచ్చుకొనుటకాని పేదలకు వీలుగాని విషయములు. మరియు పౌరులకు సరియయిన మంచినీరు, వలసిన గాలి అవసరము. దోమలు మున్నగు వానినుండి రక్షణ కావలయును. ఈ విషయమున కూడ మనము వెనుకబడి యున్నాము. ప్రజల గృహములు సాధారణముగా (అనేకములు) అనారోగ్య పూరితములు. దుర్గంధ భూయిష్ఠములగు పరిసరములుండును. దేశ దారిద్ర్యము తొలగినయెడల ప్రజలు పుష్టికరమగు ఆహారము తినుటకుగాని, అటు ప్రభుత్వము మంచినీటివసతి, మురుగు కాల్వల నిర్మాణము మున్నగు సదుపాయములు చేయుటకు గాని అవకాశము చిక్కును.

మూడవది మన దేశమున వైద్య సహాయము తక్కువ. వలసినంత మంది వైద్యులు లేరు. మంత్రసానులు మొదలగు సహాయులు లేరు. గ్రామ ప్రాంతములలో వైద్య సహాయము మిక్కిలి తక్కువ.

ప్రజలకు ఆరోగ్యము సరిగా నుండువలయునన్న ఆ కార్యక్రమమున రెండు భాగములున్నవి. ౧. నివారణ, ౨. చికిత్స – టీకాలు ఇంజక్షనులు మొదలగు వానిద్వారా కలరా, మశూచి మొదలగు వ్యాధులను అరికట్టవచ్చును. చికిత్స విషయములో ప్రభుత్వమువారు పెక్కు వైద్యశాలలను నెలకొల్పవలయును. వైద్య పట్టములు బడసిన యువకులు ఉత్సాహముతో గ్రామములకు పోయి అచట ప్రజలకు సేవ చేయవలయును. యదార్థమగు వైద్యవిద్య లేక బూటు

కపు మాటలతో ప్రజలను మోసము చేయుచున్న నాపత్రి వేషధారులను శిక్షించవలయును. అల్లోపతి వైద్యులతో పాటు సమర్థులగు యునాని, ఆయుర్వేద, హోమియోపతి నిపుణులను ప్రోత్సహించవలసియున్నది. గ్రామ గ్రామమునకు పర్యటించు వైద్య ప్రముఖుల సహాయము నేర్పరుచుటకూడ అవసరము.

---

# పదునెనిమిదవ ప్రకరణము

## హిందూదేశ పరిపాలనము

మన దేశచరిత్రయందు ఆగష్టు పదునైదవ తేదీయు జనవరి యిరువది ఆరవ తేదీయు చరిత్రాత్మక దినములుగ పరిగణింపబడుచున్నవి. ఆగష్టు పదిహేను ౧౯౪౭ మనకు స్వాతంత్ర్యము లభించిన దినము. జనవరి ౨౬ వ తేదీ ౧౯౫౦ సంవత్సరమందు మన నూతన రాజ్యాంగము అమలులోనికి వచ్చిన దినము. ఈ సందర్భమున మనకు సహజముగ రెండు ప్రశ్నలు స్ఫురింపగలవు.

జనవరి ౨౬ వ తేదీన అమలులోనికి వచ్చిన రాజ్యాంగ విధాన మెట్టిది ?

అది అమలులోనికి రాక పూర్వము మన దేశమందు అమలులోనున్న రాజ్యాంగపద్ధతి ఏమి ?

అందు రెండవ ప్రశ్నకు సహజముగా మొదట సమాధాన మీయవలసియుండును.

ఆంగ్ల ప్రభుత్వమువారు ౧౮౫౮ లో ఇండియా పరిపాలనను తూర్పిండియా వర్తకసంఘము వారినుండి గ్రహించిరి. వారు అధికారమును ౧౯౪౭ లో భారతీయులకు స్వాధీనము చేయుటకు పూర్వము కొన్ని సంస్కరణములను చేయకపోలేదు. అందులకు ముఖ్య కారణములు కొన్ని గలవు. భారతీయులను స్వపరిపాలనకు తయారు చేసెదమని విక్టోరియా రాణి ప్రకటనలో వెల్లడించిన భావము వారిపై నొక గొప్ప

బాధ్యత నిడెను. పాశ్చాత్య విద్యా విధానము భారతీయ యువకులలో నవ చైతన్యమును కల్గించెను. ౧౮౮౫ లో భారతీయులు ప్రభుత్వమునకు తమ కోర్కెలు వెల్లడించుటకు భారత జాతీయ మహాసభను నెలకొల్పిరి. ఆ సంస్థ గాంధి మహాత్ముని నాయకత్వమున ప్రభుత్వముపై ఒత్తిడిని తెచ్చి భారతీయ స్వాతంత్ర్యమునకై కృషి సాగించెను.

౧౯౪౭ వ సంవత్సరమునకు పూర్వము బ్రిటిష్ ప్రభుత్వము వారు ప్రవేశపెట్టిన సంస్కరణములలో మూడింటిని ముఖ్యముగా గుర్తుంచుకొన వలసియున్నది. అందు మొదటిది మింటో-మార్లే సంస్కరణలు. (౧౯౦౯) శాసనసభ్యుల సంఖ్య హెచ్చించుటయు స్థానిక సంస్థలవారు కొందరి నెన్నుకొనుటకు అవకాశమిచ్చుటయు, ప్రత్యేక నియోజక వర్గములను మతవర్గముల వారికిచ్చుటయు ఇందలి ముఖ్యలక్షణములు. ఇందువలన భారతీయులకు లభించిన అధికారము స్వల్పము. మత ప్రాతినిధ్యమువలన భారత జాతీయ ఐక్యతకు కల్గిన హాని మిక్కుటము.

ఈ సంస్కరణముల తర్వాత ౧౯౧౯లో మాంటేగూ-చెమ్స్‌ఫర్డు సంస్కరణలు వచ్చెను. ఇవి మొదటి ప్రపంచ యుద్ధములో భారతీయులు చేసిన సేవకు పారితోషికమని ఆంగ్లేయ అధికారులు ప్రకటించిరి. ఒక పరిమితిగల అధికారము గల వారందరు ఓటింగ్ హక్కుగలవారైరి. ఢిల్లీలో కేంద్ర శాసనసభ, స్టేటు కౌన్సిలు అను సభలు నెల్పకొల్పబడెను. రాజప్రతినిధి కార్యనిర్వాహక సభ్యులు ఈ సభలకు బాధ్యులు కాదు. రాష్ట్రములో ద్వంద ప్రభుత్వ విధానము ప్రవేశపెట్ట

బడెను. విద్య, వైద్యారోగ్యము, స్థానికసంస్థలు మొదలగు శాఖలు ప్రజా ప్రతినిధులగు మంత్రులకు స్వాధీనపరుపబడెను. వీరు శాసనసభకు బాధ్యులు. కాని పోలీసు ఆర్థికశాఖ మొదలగు శాఖలు ప్రభుత్వ నియమితులగు కార్యనిర్వాహక సభ్యుల చేతులలో నుండెను. వారు శాసనసభకు బాధ్యులు కారు.

తరువాత రెండు రౌండు టేబిల్ సమావేశముల చర్చల ఫలితముగా ౧౯౩౫ చట్టము ప్రకటింపబడెను. ఇందు కేంద్రమునకు సంబంధించినంతవరకు ఒక్క ఫెడరల్ కోర్టు తప్ప తక్కినది అమలులోనికి రాలేదు. కాంగ్రెసు లీగు సంస్థానాధిపతులు మున్నగువారు వేర్వేరు కారణములచే దానిని తిరస్కరించిరి. ౧౯౩౭ లో రాష్ట్రముతో సంబంధించిన భాగము అమలులోనికి వచ్చెను. కాంగ్రెసువారు ఏడు రాష్ట్రములలో పరిపాలనాధికారము స్వీకరించిరి. రాష్ట్రములలో ద్వంద్వ ప్రభుత్వ విధానమునకు స్వస్తిచెప్పబడి అన్ని శాఖలు ప్రజా ప్రతినిధులగు మంత్రులకు స్వాధీనపరచబడెను. వారు శాసనసభకు బాధ్యులు. శాసనసభ వారికి ప్రభుత్వము వారి ఆదాయ వ్యయ పట్టికను అంగీకరించు అధికారమీయబడెను. గవర్నరుకు కొన్ని సందర్భములలో మంత్రుల సలహాను తిరస్కరించుటకు అధికారమీయబడెను. కొన్ని రాష్ట్రములలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు అను రెండు శాసనసభలు స్థాపింపబడెను. రెండవ ప్రపంచ యుద్ధము వచ్చినది. కాంగ్రెసు వారు అధికారము విడనాడిరి. గవర్నరు పరిపాలన కాంగ్రెస్ వారు పాలించు రాష్ట్రములలో ఏర్పడెను. కేంద్రమున ౧౯౧౯ చట్టము ననుసరించి పరిపాలన సాగుచుండెను.

౧౯౪౬ వ సంవత్సరమున మన రాజ్యాంగ పరిషత్తు పని ప్రారంభించినది. ౧౯౪౭ లో ఇండియా స్వాతంత్ర్య దేశ మాయెను. ౧౯౫౦ జనవరిలో నూతన రాజ్యాంగచట్టము అమలులోనికి వచ్చినది.

ఈ రాజ్యాంగ చట్టమునందలి నిబంధనలను పరిశీలించుటకు పూర్వము ఇందలి ప్రత్యేక లక్షణములు కొన్నింటిని గుర్తింపవలసియున్నది.

అనేక మంది ప్రముఖ న్యాయవాదులు రాజ్యాంగ వేత్తల కృషి ఫలితముగా ౧౯౪౬ డిశంబరు నుండి ౧౯౪౯ నవంబరు నెల వరకు జరిగిన కృషి ఫలితముగా సుమారు ౬౪ లక్షల రూపాయల ఖర్చుతో తయారైన యీ రాజ్యాంగ చట్టము ప్రజల స్వయం నిర్ణయహక్కు అను సూత్రముపై నాధారపడినది. దీనికొరకే భారతీయులు అపార త్యాగము చేసిరి.

ఈ రాజ్యాంగ చట్టము జాతీయైక్యతను గూర్చి శ్రద్ధ వహించినది. మన రాజ్యము మతాతీత రాజ్యము (సెక్యులర్ స్టేటు) అని ప్రకటించియు, ప్రత్యేక నియోజక వర్గములను రద్దు పరచియు, భారత పౌరుడగు వ్యక్తి తత్త్వాచరణమున వివిధ రాష్ట్రములన్నింట పౌరుడగునని ప్రకటించియు, వయోజనఓటింగు హక్కు నంగీకరించియు, నిమ్న జాత్యభ్యుదయమును గూర్చి నొక్కి వక్కాణించియు, జాతీయైక్యతను నిలబెట్టుటకు తగిన చర్యలు తీసికొన్నది.

ఫెడరల్ ప్రజాస్వామ్యమును ఆశయముగా కలిగినయీ చట్టము అవసరమగుచో వలయునపుడు ఐక్య రాజ్యముగా

వ్యవహరించు కట్టుదిట్టములు చేసినది. ఇందు ౨౭ రాష్ట్రము లుండెను. అవి మూడు భాగములు చేయబడినవి. అవియే ఏ, బి, సి తరగతి రాష్ట్రములు. ఏ తరగతి రాష్ట్రములనగా పూర్వము బ్రిటిషువారిచే గవర్నరుల ద్వారా పాలింపబడి నవి. బి తరగతి రాష్ట్రములనగా పూర్వము స్వదేశ సంస్థానాధీశులచే పాలింపబడునవి. సి తరగతి రాష్ట్రములనగా పూర్వపు ఛీఫ్ కమిషనర్ రాష్ట్రములు. కాని వాని అధికారములు సమానమైనవికావు. ఇటీవల ఆంధ్ర రాష్ట్రము నిర్మింపబడుట వలన ఏ తరగతి రాష్ట్రముల సంఖ్యకు మరియొకటి చేరినది. ఇటీవల భారతప్రభుత్వ రాష్ట్రపునర్వ్యవస్థీకరణమునకై సూచనలు చేయుటకు ఫజులాలీవిచారణ సంఘము నియమించబడెను. ౬౬ విషయములు కేవలము కేంద్రము క్రిందను, ౬౬ విషయములు కేవలము రాష్ట్రముల క్రిందను ౪౭ విషయములు సమిష్టిగా ఉభయుల క్రిందను ఉండును. వీనియందెవరైన తమ అధికారము నతిక్రమించినచో సుప్రీమ్ కోర్టువారు ఇది అశాస్త్రీయమని ప్రకటింపవచ్చును. అట్లు ఫెడరల్ యూనిటరీ విధానములను మిళితము చేయుటతో పాటు అధ్యక్ష పార్లమెంటరీ విధానములను గూడ సమన్వయించినది.

ఈ రాజ్యాంగ చట్టమును మార్పుచేయుట కడు కష్టసాధ్యము కాదు. పార్లమెంటులో నిర్ణీత ప్రత్యేక అధిక సంఖ్యామోదము, సగము కన్న తక్కువ సంఖ్యకాని రాష్ట్రప్రభుత్వముల అంగీకారమును పొందవలసి ఉన్నది.

ప్రభుత్వము యథేచ్ఛముగా వ్యవహరింపకుండ అదుపులో నుంచుటకు పబ్లిక్ సర్వీస్ కమిషన్, ఆడిటర్ జనరల్

కార్యాలయము, న్యాయస్థానములను సంస్థలు కల్పింపబడినవి. ఇందలి నిబంధనలను మూడు భాగములుగా చేయవచ్చును.

ఏ రాజ్యాంగ తత్వమును నిర్వచించునవి :- ఇందు పేర్కొనవలసినవి ప్రాథమిక హక్కులు, ప్రభుత్వ రాజనీతి నిర్దేశక సూత్రములు. సమానత్వము. వ్యక్తిస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, సభాస్వాతంత్ర్యము, నివాసము, ఏ వృత్తి అయిన అవలంబించుట మొదలగు వానికి సంబంధించినవి ప్రాథమిక హక్కులు. స్వాతంత్ర్యము విద్యా విజ్ఞానపు హక్కులు ఎల్లరకు అంగీకరింపబడినవి. వీనిని న్యాయస్థానముల ద్వారా అమలు జరుపుకొనవచ్చును. అందరు ప్రజలకు జీవనోపాధి కలిగించుట, నిర్బంధోచిత ప్రాథమిక విద్యా సౌకర్యములు కలిగించుట, వృద్ధాప్యము, రోగము, నిరుద్యోగము మొదలగు సందర్భములలో సహాయము న్యాయ కార్య నిర్వాహక శాఖల విభజన, ఇవి ప్రభుత్వ రాజనీతినిర్దేశక సూత్రములు. వీనిని న్యాయస్థానముల ద్వారా అమలు జరుపుకొనుట కెవ్వరికి హక్కు లేదు.

బి. కేంద్రప్రభుత్వమును గూర్చిన అంశములు:- కేంద్రమున కార్యనిర్వాహణాధికారి అధ్యక్షుడు. అతడు దాదాపుగ ఆంగ్ల దేశమున రాజువలె వ్యవహరించును. కేంద్ర రాష్ట్రీయ శాసనసభ్యులచే అతడెన్నుకొనబడును. అతని పదవీ కాలము ఐదు సంవత్సరములు. అతడు తిరిగి ఎన్నుకొనబడవచ్చును. అతనికి కేంద్ర, రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తులను, న్యాయమూర్తులను నియమించుటకు, నేరస్థులకు క్షమాభిక్ష నొసగుటకు ఆర్డినెన్సులను జారీ చేయుటకు పార్ల

మెంటులో ప్రసంగించుటకు శాసనములపై ఆమోదముద్ర వేయుటకును అసాధారణ పరిస్థితులలో ఇతర ప్రత్యేకాధికారములను ఉంచును. అధ్యక్షుడు పదవిని విసర్జించినప్పుడుగాని, తన బాధ్యతలను నిర్వహింపజాలని పరిస్థితులలో నున్నపుడు కాని అధ్యక్షుడుగా వ్యవహరించుటకు ఉపాధ్యక్షుడుండును. అతనిని పార్లమెంటు ఎన్నుకొనును. ఇతడు కౌన్సిల్ ఆఫ్ స్టేట్సుకు అధ్యక్షుడుగా కూడ వ్యవహరించును. శాసనసభలలో అధికసంఖ్యాకుల పక్షనాయకుని అధ్యక్షుడు ప్రధాన మంత్రిగా ఆహ్వానించి అతని సలహాతో యితర మంత్రులను నియమించును.

యూనియన్ శాసనసభలు రెండు. అందు మొదటిది కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు. రెండవది ప్రజాప్రతినిధి సభ. ఈ రెంటికి గల భేదములు గుర్తింపవలసి యున్నది కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు శాశ్వతము. ఇందలి ౨౫౦ మంది సభ్యులలో మూడవ వంతు ప్రతి రెండు సంవత్సరముల పిదపను విరమించుదురు. ప్రజా ప్రతినిధిసభ కాలము ఐదు సంవత్సరముల కొకసారి కాని ఒక్కొక్కప్పుడు అంతకుముందే కాని ముగియవచ్చును. ప్రజాప్రతినిధిసభ సభ్యులు (వీరి ప్రస్తుతసంఖ్య ౪౮౯) ప్రత్యక్ష పద్ధతిని వయోజనులచే ఎన్నుకొన బడుదురు. స్టేటు కౌన్సిల్ సభ్యులు పరోక్ష పద్ధతిద్వారా వచ్చినవారు. ప్రతి ౭౫౦, ౦౦౦ మించని ౫౦౦, ౦౦౦ తగ్గని జన సంఖ్యకు ఒక్కొక్క సభ్యుడుండును. ప్రజా ప్రతినిధిసభ అధ్యక్షుడగు స్పీకరు ఎన్నుకొనబడును. ఆర్థిక సంబంధమైన బిల్లులు స్టేటు కౌన్సిల్ అనుమతి లేకనే శాసనములు కావచ్చును. రెండు సభల మధ్య అభిప్రాయ భేదము కలిగినయెడల సంయుక్త సమావేశముల ద్వారా

పరిష్కరింపవచ్చును. అధమ పక్షము సాలుకు రెండు సార్లయినను శాసనసభనుసమావేశపర్చవలెను. యూనియన్ ప్రభుత్వపు మూడవ శాఖయైన సుప్రీంకోర్టును గూర్చి వేరొకచో వ్రాయబడినది.

రాష్ట్ర పరిపాలనము:- పట్టికలో ౬౬ విషయములు కేవలము రాష్ట్ర ప్రభుత్వముల యాజమాన్యము క్రిందను ౪౭ ఉభయుల యొక్క సమిష్టి యాజమాన్యము క్రిందను ఉండునని ఇదివరకే చెప్పబడెను. రాష్ట్ర పరిపాలన దాదాపు కేంద్ర పరిపాలన వలెనే ఉండును. పరిపాలనాధిపతియగు గవర్నరు లేక రాజప్రముఖ్, కేంద్రమున అధ్యక్షుని వలెనే వ్యవహరించును. దైనందిన పరిపాలన మంత్రివర్గము వారు నిర్వహింతురు. వీరు సమిష్టిగా శాసనసభకు బాధ్యులు. అస్సెంబ్లీ జీవితకాలము ౫ సంవత్సరాలు. మదరాసు, పశ్చిమ బెంగాలు, బొంబాయి మొదలగు కొన్ని రాష్ట్రములలోని రెండు శాసనసభలుండును. ఏ రాష్ట్ర అస్సెంబ్లీలో కాని సభ్యుల సంఖ్య ౬౦ కు తక్కువగాక ౫౦౦ కు హెచ్చుక అనగా ప్రతి ౭౫ వేల మందికి ఒక ప్రతినిధి యుండును. ఏ రాష్ట్రపు కౌన్సిలులో కాని, ౪౦కి తక్కువ గాక దిగువ శాసనసభలోని సంఖ్యలో నాలుగోవంతుకు మించని సంఖ్యగల సభ్యులుందురు. వారు దిగువ శాసనసభ; పట్టభద్రులు, స్థానిక సంస్థలు మొదలగు ప్రత్యేక నియోజక వర్గములచే ఎన్నుకొనబడుదురు. కాని పార్లమెంటునందువలె సమిష్టి సమావేశములు జరుగవు.

న్యాయశాఖ:- మన రాజ్యాంగ నిర్మాతలు స్వతంత్రమైన న్యాయశాఖ ఆవశ్యకమును గుర్తించిరి. దేశమంతకు

సుప్రీం కోర్టు ఉండును. అందు 8 గురు న్యాయమూర్తులుందురు. వీరిని అధ్యక్షుడే నియమించును. ఉభయ శాసన సభలందు 2/3 మంది సభ్యులు ఆమోదించిన తీర్మానముపై అతడు వీరిని తొలగింపవచ్చును. వీరు ౬౫ ఏండ్ల వయస్సు వచ్చువరకు ఆ పదవిలో నుందురు. వారు ప్రారంభ వ్యాజ్యములు, (ఒరిజినల్ కేసెస్) అప్పీళ్లను, విచారించుటకును కోరబడినచో సలహాల నిచ్చుటకు నిర్దేశింపబడినారు. వీరికీబడు జీతములు మొత్తము రాజ్యాంగ చట్టముందే ఉదహరింపబడినవి. ఎ. బి. తరగతి రాష్ట్రములలో హైకోర్టు లుండును. వారి నియామకము, తొలగింపు అధ్యక్షుని అధికారములో నుండును. వీరు విరమింపవలసిన వయస్సు ౬౦ సంవత్సరములు మాత్రమే. వీరి క్రింద జిల్లా జడ్జీలుందురు. వీరందరి అర్హతలు మొదలగు విషయములు రాజ్యాంగ చట్టమున స్పష్టముగా నిర్వచింపబడినవి.

హైదరాబాదు రాష్ట్రము:- పోలీసుచర్య పిదప హైదరాబాదు రాష్ట్రము ఇండియా యందలి అంతర్భాగమైనది. కావున ప్రత్యేకత్వమును సూచించు దిగుమతి సుంకములు ప్రత్యేక నాణ్యము వగైరా రద్దు చేయబడినవి. రెండవ మార్పు ప్రజాస్వామ్య ప్రభుత్వము అమలులోనికి వచ్చుట. ౧౯౫౨ లో జరిగిన ఎన్నికల ఫలితముగా శాసనసభకు బాధ్యులైన మంత్రివర్గమువారు పాలించుచున్నారు. మన శాసనసభలో సభ్యుల సంఖ్య ౧౭౫.

వయోజన వోటింగుతో నేర్పడిన మొదటి ప్రజాస్వామిక శాసనసభ్యులైన యీ సభవారు ప్రజాక్షేమమునకై

అనేక శాసనములు చేసియున్నారు. నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టుట, జిల్లాబోర్డులు మొదలగు స్థానిక సంస్థల నెలకొల్పుట, భూసంస్కరణలను ప్రవేశపెట్టుట మొదలగు విషయములపై యీ సభయందు తీర్మానింపబడినవి. ప్రతి సాలున ఆదాయ వ్యయ పట్టిక శాసనసభయందామోదింప బడును. ఆ సమావేశముననే రాజప్రముఖ్ శాసనసభలో ప్రసంగించును. విద్య, ఆరోగ్యము, పరిశ్రమలు మొదలగు ప్రజాభివృద్ధి ప్రణాళికలపై అధికముగా వ్యయము చేయుట కును, నిరుద్యోగము మొదలగు వానిని నిర్మూలించుటకును ప్రభుత్వము తీవ్ర కృషి చేయుచున్నది. 56 అక్టోబరులో రాష్ట్ర విభజన జరిగిన వెంటనే రాజప్రముఖ పదవి రద్దు కాగలదు.

---

# పంతొమ్మిదవ ప్రకరణము

## ప్రపంచ శాంతి

ఈ ప్రపంచమునందు అనేక యుద్ధములు జరిగినవి. యూరపులో నూరు సంవత్సరముల యుద్ధము, ఏడు సంవత్సరముల యుద్ధము, క్రిమియన్ యుద్ధము మొదలగునవి, మన దేశమున కళింగయుద్ధము, పానిపట్టు యుద్ధము కర్ణాటక యుద్ధము మొదలగునవిట్టివే. పూర్వకాలమున రాజ్యము వీరభోజ్యమను సూత్రమారాధింపబడుటయే యీ యుద్ధములకు కారణమయ్యెను.

ప్రాచీన కాలమున యుద్ధమనగా రెండు సైన్యముల మధ్య జరుగు పోరాటమై యుండెను. కావున వీనివలన జరుగు నష్టము పరిమితమైయుండెను. కాని మొదటి ప్రపంచ యుద్ధము నాటికే (౧౯౧౪–౧౯౧౮) ప్రపంచమున శాస్త్రజ్ఞానము వృద్ధియయ్యెను. యుద్ధమువలని ప్రమాదము అధికమయ్యెను. అంతేగాక శాస్త్రమువలన దేశములు ఒకదానికొకటి మిగుల సన్నిహితములగుటచే యుద్ధజ్వాలలు ఒక దేశమునుండి మరియొక దేశమునకు మిగుల త్వరితముగా వ్యాపింపజొచ్చెను. కావున ఏ దేశమునకు అసంతృప్తి కల్గినను దాని ఫలితములు ప్రత్యర్థి దేశమునసేగాక ప్రపంచమునందంతటను వ్యాపించునను సూత్రమును నాటి విజేతలైన బ్రిటిష్ సామ్రాజ్యవాదులును వారి మిత్రులును గుర్తింపరైరి. జర్మనీపై విధించిన కఠిన నిబంధనలవలన మరల రెండు దశాబ్దములలోపలనే రెండవ ప్రపంచ యుద్ధమాసన్నమాయెను.

ఈ యుద్ధము ౧౯౩౯ లో ప్రారంభమాయెను. ఈ యుద్ధకాలములో జరిగిన భీభత్సమును వర్ణించుట అశక్యము. అనేక గ్రామములు, పట్టణములు నేలమట్టములైనవి. కోట్ల కొలది ప్రజలు మరణించిరి. లేదా వికలాంగులైరి. వస్తువులు కొరతయై పోయినవి సబ్ మెరీన్, విమానము, టాంకు, ఆటంబాంబ్ మున్నగు సాధనములవలన ఎంతయో ప్రమాదము జరిగినది.

మొదటి ప్రపంచ యుద్ధమున జరిగిన ప్రమాదమును గుర్తించి అమెరికాకు నాడు అధ్యక్షుడైన వుడ్రో విల్సన్ అంతర్జాతీయ సోదరభావమును పెంపొందించి యుద్ధముల నిర్మూలించుటకు నానాజాతి సమితిని స్థాపించినాడు. కాని అనేక దేశములు తమ స్వార్థమునకై యీ సమితిని ఉపయోగించుకొన గోరినవి. తమ అహితులగు రష్యా వంటి దేశములకు స్థానము నిరాకరించినవి. ఏ దేశపు అధ్యక్షుడు దీనిని నెలకొల్పెనో ఆ అమెరికా దేశమే దీని నుండి వైతొలగెను. జపాన్, ఇటలీ, జర్మనీ దేశము యీ సంఘముయొక్క ఆజ్ఞలను వ్యతిరేకించుటకు కూడ సాహసించినవి. వానిని నివారించుటకు సమితి సమర్థము గాకుండెను. దానితో ఈ సమితి యునికి నిష్ఫలమయ్యెను.

రెండవ ప్రపంచ యుద్ధకాలమున మిత్రమండలివారు శాన్ ఫ్రాన్సిస్కో సమావేశమున ౧౯౪౫ ఐక్యరాజ్య సమితి (యు. యన్. ఒ.) అను సంస్థను నెలకొల్పిరి. దీని ఆశయముకూడ యుద్ధ నిర్మూలనము, శాంతి రక్షణ, ఆర్థిక,

విజ్ఞానాది రంగములలో పరస్పర సహకారమును పెంపొందించుటయునై యున్నవి. ఈ సంఘములోగల భాగములు ఆరు.

౧. జనరల్ అసెంబ్లీ,
౨. భద్రతామండలి (ఇది మిక్కిలి ప్రధానమైనది),
౩. అంతర్జాతీయ న్యాయస్థానము,
౪. ఆర్థిక సాంఘిక సమితి,
౫. ధర్మకర్తృత్వ సంఘము,
౬. కార్య నిర్వాహక సమితి.

కాని ఐక్యరాజ్య సమితి కూడ వివిధదేశముల భేదభావములకు ప్రదర్శనశాల యైనది. ఏ విషయమును గుణాగుణములనుపట్టి పరీక్షింపజాలకున్నదనియు, సంకుచిత రాజకీయములు ప్రబలుచున్నవనియు ఇది గూడ వెనుకటి నానాజాతి సమితిని మించి ఏమియు చేయజాలదని కొందరు భయపడుచున్నారు.

కాని కొందరు ఇవన్నియు బాలారిష్టములనియు, యిది క్రమముగా ఐక్య ప్రపంచ ప్రభుత్వము (World Fadaration) నిర్మాణమునకు నాందీప్రస్తావన గాగలదనియు నమ్ముచున్నారు. అందు వ్యక్తియొక్క హక్కులు నిర్వచింప బడినవి. ఏది నిజమగునో కాలగర్భములోనేమి యిమిడియున్నదో కాలమే ఋజువు చేయగలదు.

---

# ఇరువదవ ప్రకరణము

## మన విధ్యుక్త ధర్మములు

మానవునకు కొన్ని హక్కులు గలవు. కొన్ని విధులు గూడ యున్నవి. విధులను విస్మరించి హక్కులను మాత్రమే మనము కోరిన అది అరాజకమునకు దారి తీయును. హక్కులు లేక విధులను మాత్రమే నిర్వర్తించుటయే మిగిలిన అది బానిసత్వము అనిపించుకొనును. ఏ దేశమున ప్రజలందరు హక్కుల ననుభవించుచు విధులను నిర్వర్తింతురో అచట నిజమగు నాగరికత వర్ధిల్లును.

ధర్మ భరితమగు రాజ్య నిర్మాణము ప్రాచీన కాలము నుండియు మహనీయుల ఆదర్శమైయుండెను. ప్లేటో దానిని "Rupublic" (రిపబ్లిక్) అను గ్రంథమున చిత్రించెను. సర్ థామస్ మూర్ అను నతడట్టి ఆదర్శరాజ్యమును (యుటోపియా) ఒక గ్రంథమున చిత్రించెను. గాంధీ మహాత్ముడు దానిని రామ రాజ్యమనెను. అట్టి ఆదర్శ వ్యవస్థకు గల పునాదులను అనేకులనేక విధముల నిర్వచించిరి. ప్రాచీన గ్రీకులు సౌందర్యము (Beauty) సత్యము (Truth) సోదర భావము (Goodness) నాగరికతకు పునాదులనిరి. ఇటీవలి పాశ్చాత్యులు సమానత్వము (Equality) స్వాతంత్ర్యము (Liberty) సోదర భావము (Antunity) మానవాభ్యుదయమున కావశ్యకముల నిరి. గాంధి మహాత్ముడు సత్య అహింసలే మానవునిలో మానవత్వము నిలప జాలుననినాడు.

కేవలము ప్రభుత్వ శాసనముల వలన ఏ దేశము బాగు పడజాలదు. ప్రతి వ్యక్తియు ఒక శాసన సభయై తనపై తాను నిబంధనలు విధించుకొన వలయును. కార్యనిర్వాహకుడై వానిని ఆచరణలోనికి తేవలయును. న్యాయస్థానమై తాను వానినెంతవరకు ఆచరించినది ఆత్మపరీక్ష చేసికొన వలయును. ఉదాహరణకు మన రాజ్యము మతాతీత రాజ్యము (Secular State) అయియున్నది. కాని మన మందరము కుల, మత భేదములు లేక సమభావముతో వర్తించిననే యీ ఆదర్శము సఫలమగును.

అట్లే మన రాజ్యాంగము అస్పృశ్యతను చట్ట విరుద్ధమని ప్రకటించినది. మనము హృదయ పూర్వకముగా కృషి చేసినకాని ఈ సాంఘిక దురాచారము తొలగిపోదు.

"సర్వే జనాస్సుఖినో భవంతు" అనునది నేడు మన మనుసరింపవలసిన ఆశయము. నాడే మన దేశమునకు త్యాగ మొనర్చిన మహనీయుల యెడల మన కర్తవ్యము నిర్వర్తించిన వారమగుదుము. గాంధీ మొదలగు వారు ఆత్మార్పణ చేసిన అశయమదే. ఆ మాటను ఎవరును మరువరాదు. ముఖ్యముగా దీనిని మరువకూడదని వారు భావి భారత భాగ్యోదయ సుపుత్రులైన విద్యార్థులు— మహా భారతమున చెప్పబడినట్లు:-

